అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం
సంపాదకుడు:
లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,
వి.బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎడ్.,

సభ్యులు:
కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,
కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,
కె.రత్నకుమారి

చందా వివరాలు

జీవిత చందా.............రూ. 400/-
3 సంవత్సరాల చందా.......రూ. 100/-
సంవత్సర చందా...........రూ. 36/-
ఎయిర్ మెయిల్ (1 సం॥)....రూ. 130/-
సీ మెయిల్ (1 సం॥).........రూ. 75/-

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేశికారోడ్, మైలాపూర్, మద్రాస్-600004.
ఫోన్: 73327

## ఈ సంచికలో

నవంబరు 1989



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
యోగా

## పవిత్రమైన సౌశీల్యం




ఎందరెందరో ఎన్నెన్నో ఉద్యమాలను చేపట్టి సాధించడానికి ప్రయత్నిస్తారు. సాధించిన ప్రతీ ఉద్యమానికి తగినంత ఫలితం, ఆనందం లభిస్తుంది. ఫలితం ఎప్పుడూ ఉద్యమానుగుణ్యంగానే ఉంటుంది. నీవు పొందిన విజయం ప్రాపంచికం కావచ్చు; పారమార్థికం కావచ్చు. ప్రాపంచికం అయితే ఆనందం అతి శీఘ్రంగా పొందుతావు. అది తాత్కాలికమే. చిరకాలం ఉండదు. చెపట్టిన ఉద్యమం పారమార్థికం అయితే లభించే ఆనందానుభూతి పరిపూర్ణంగా ఉంటుంది; సుస్థిరంగా ఉంటుంది. ఒకసార్, రెండుసార్లు కాదు. ఎన్నోసార్లు ప్రయత్నాలు చేసి విజయం సాధిస్తే పొందే ఆనందం అపారం. ప్రయత్నాలు చేయగా చేయగా పుణ్యం ఫలించి, పాపం క్షీణించి నీలో కరుడుగట్టుకు పోయిన ఏ చిన్న దోషమో కరిగి హరించి

(మిగతా 4 వ పేజీలో)

## మానసిక శాంతి

మనిషికి ఎగ ఊపిరి, దిగ ఊపిరి, నిద్ర లాగే మనసులో చికాకులు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. ప్రతీ మానవునికి కలతలు ఉండక మానవు. కలతలు లేని మనిషి ఉండడు. ఎంత భాగ్యవంతుడైనా మనసులో శోభ తప్పదు కదా! సమాజంలో ఎంతో గౌరవం మర్యాద ఉండవచ్చు. ఎంతో పేరు ఉండవచ్చు. ఇవి మానవ మాత్రులకు ఎంత మాత్రం శాంతిని చేకూర్చలేవు.

ఆత్మ సామర్థ్యంతో శాంతిని పొందాలి. మానసికమైన శాంతికి ఒకటే రహస్యం. అనవసరంగా చింతతో మదనపడిపోకుండా జీవించడానికి ప్రారంభించాలి. తాత్కాలికంగా ఆవేశపూరితమైన సమస్యలు ఉంటే వాటితో చిరకాలం వ్యసనపడి పోకుండా సకాలంలో వాటిని సాధించాలి. మానసికమైన ఆవేశాలు, ఆలోచనలు. భావాలు అగ్ని వంటివి. అగ్ని సహాయంతో వంట వండుకోవచ్చు. ఆ అగ్నే ఇంటిని కాల్చేస్తుంది. వివేకంతో వినియోగవంతంగా ఉపయోగించుకోవాలి. నీ దిగ్విజయానికి దోహదం కలిగించేటట్లుగా వాటిని ఉపయోగించుకోవాలి.

నీ ధర్మాన్ని నీవు సక్రమంగా ఆచరించు అత్యాశకు పోయి ముందుకు పరుగెత్తితే పతనం తప్పదు. నీ లక్ష్యాలను నీ శక్తిసామర్థ్యాలకు అనుగుణ్యంగా, న్యాయ

(మిగతా 3 వ పేజీలో)

# ఇంగ్లీషు-అద్భుతమైన సమైక్య సాధనం

భారతదేశంలో ఆంగ్లేయభాష అద్భుతమైన సమైక్య సాధనం అని వివేకవంతుడైన ప్రతీ భారతీయుడికి తెలుసు. దేశంలో వివిధ భాషలను మాట్లాడుకునే వారినందరిని సమైక్యపరచింది ఇంగ్లీషుభాష. దీనివల్లే భారత స్వాతంత్ర్యం శీఘ్రంగా సిద్ధించింది అని చెప్పుకోవాలి.

మనం గత రెండు శతాబ్దాలుగా ఇంగ్లీషు భాషను ఉపయోగిస్తున్నాం. ఎంతోమంది భారతీయులు ఆంగ్ల భాషలో ఆంగ్లేయుల కంటే అధిక పాండిత్యాన్ని సంపాదించారు రచనలో కూడా భారతీయులు తమతో సమానంగా ఉన్నారని కొందరు ఆంగ్లేయ పండితులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

—'ఆదిత్య' సౌజన్యంతో



SWAMI VIVEKANANDA

ఒకసారి స్వామి వివేకానంద మద్రాసులో ప్రజలను ప్రబోధిస్తూ తాను భారతధర్మాన్ని గురించి ప్రసంగింప దలచుకున్న తన మద్రాసు సోదరులకు ఇంగ్లీషులోనే బాగా తెలియజెప్పగలను అన్నారు. ఒక్క భారత దేశంలోనే కాదు ఇతర దేశాలలో కూడా చాలామందికి ఇంగ్లీషు తెలుస్తుంది మహాద్భుతమైన ఈ ప్రపంచ భాషను క్రమంగా వదులుకుంటే ప్రగతిపథంలో మన ప్రయాణం వెనక్కు సాగుతుంది.

(2 వ పేజీ తరువాయి)

దిద్దంగా నిర్ణయించుకో. సంతృప్తి, సంతుష్టి లేకపోతే జీవితంలో సుఖం, సౌఖ్యం, ఆనందం కరువై పోతాయి. తీరిక సమయాలను సద్వినియోగం చేసుకోడానికి మంచి హాబీని అభ్యాసం చేసుకో. ఇంట్లో తోటపని, ఫొటోగ్రఫీ, స్టాంపులు, నాణాలు, పురాతన వస్తువులు మొదలైన వాటిని సేకరించి పరిశోధించడం వంటి హాబీలను ప్రారంభించు. వీటివల్ల ఎంతో ఆనందం, ఎంతో లాభం కలుగుతుంది. పుణ్యం, పురుషారం కూడా లభిస్తాయి. వీటి అన్నిటికంటే దృఢమైన ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. విశ్వాసం లేని మనస్సుకి శాంతి ఎక్కడిది? ధర్మబద్ధమైన జీవితంలో స్వాత్మకంగా జీవించడమే శాంతికి రా. మార్గం.

## డా॥ మేఘనాధ్ సాహా

అక్టోబర్ 6, 1893 లో జన్మించిన డా॥ మేఘనాధ్ సాహా కలకత్తా యూనివర్శిటీలో ఎమ్. ఎ. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. లండన్ యూనివర్శిటీలో D. Sc. పట్టాన్నిపొందాడు. ఆనాటి నుంచి భౌతిక శాస్త్రంలో వివిధ



DR M N. SAHA

రంగాలలో విస్తృత పరిశోధనలు కొనసాగిస్తూ విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డాడు.

1921-23 సం॥లలో ఇతడు కలకత్తా యూనివర్శిటీలో ఖెయిరా ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్స్‌గా పని చేసాడు 1923-38 సంవత్సరాల మధ్య అలహాబాద్ యూనివర్శిటీలో ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్స్ పదవిని స్వీకరించాడు. 1938-52 సం॥ల మధ్య ఇతడు కలకత్తాలో పాలిట్ ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్స్‌గా పని చేసాడు. 1952 నుంచి 1956 వరకు ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది కల్టివేషన్ ఆఫ్ సైన్స్‌కు డైరక్టరుగా నియమితుడైనాడు. 1955-56 సంవత్సరంలో కలకత్తాలో ఇతడు స్థాపించిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్‌కి డైరక్టరుగా ఉన్నాడు. 1952 నుండి 1956 వరకు పార్లమెంట్ (లోక్‌సభ) సభ్యుడుగా ఉన్నాడు.

డా॥ సాహా 1934 లో ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించాడు. 1927 లో ఫెలో ఆఫ్ ది రాయల్ సొసైటీగాను, 1936 లో ఫెలో ఆఫ్ ది అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కార్నిజీ ట్రావెలింగ్ ఫెలోగానూ ఎన్నుకోబడ్డాడు. ఇతడి ముఖ్య రచనలు 'ఎ ట్రీటైస్ ఆన్ ది థియరీ ఆఫ్ రిలేటివిటీ', 'ఎ ట్రీటైస్ ఆన్ మోడరన్ ఫిజిక్స్', 'మై ఎక్స్‌పీరియెన్సెస్ ఇన్ రష్యా.' (మిగతా 5 వ పేజీలో)

( 2వ పేజీ తరువాయి)

పోతుంది. అప్పుడు పరమానందానుభూతికి ఆటంకం ఉండదు. స్వార్థరహితమైన ఆలోచనలతో, పవిత్రమైన ఆశయాలతో శీలాన్ని ఎప్పటికప్పుడు ఇతోధికంగా పెంచుకుంటే అఖండమైన సచ్చిదానందం అంకురిస్తుంది. మనసులో తపన ఏర్పడాలి. తపన ఏర్పడితే మనసులో మాలిన్యం కరిగిపోతుంది నీ ఉద్యమాలు సత్యప్రతిష్ఠితాలై అవి నిన్ను శక్తివంతంగా చేస్తాయి. కర్మకుశలునిగా చేస్తాయి. అంతా ఆనందమయంగా ఉంటుంది.

''వృద్ధులను గౌరవిస్తూ, పిల్లలకు నేర్పుతూ

## చంద్రగోళం అంతా అఖాతాలతో నిండిపోయింది

చంద్రగోళం పెద్ద పెద్ద మైదానాలు, లోయలు, పర్వతాలు, దుమ్ముతో నిండి పోయిన శిల. చంద్రగోళంలో కొన్ని పర్వతాలు ఎవరెస్ట్‌శిఖరం అంత ఎత్తు ఉంటాయి.

చంద్రగోళం అంతా లోతైన అఖాతాలు (క్రాటార్లు)తో నిండి ఉంటుంది. మిక్కిలి



పెద్ద క్రాటారు క్లావియస్ 234 కి.మీ. వెడల్పు 4,876 మీటర్ల లోతు ఉంటుంది. చంద్రతలంమీద గురుత్వ శక్తి భూమి గురుత్వశక్తిలో ఆరవ వంతే కాబట్టి చంద్ర తలంమీద మనిషి బరువు మామూలు బరువులో ఆరవ వంతే ఉంటుంది.

చంద్రగోళంమీద వర్షంగాని, మంచు, మేఘాలు, గాలి ఏమీ ఉండవు. 27⅓ రోజుల కాలచక్రంలో రెండువారాలపాటు (భూమి మీద కాలం) చీకటి, తరువాత రెండువారాల పాటు కళ్ళు చెదరగొట్టే సూర్యకాంతి ఉంటుంది.

చంద్రతలంమీద సూర్యకాంతిలో ఉన్న మనిషి శరీరంలో రక్తం 100°C వద్ద ఉడికిపోతూ ఉంటుంది. ఒక రాత్రిపక్క నీడలో నుంచుంటే ఉష్ణోగ్రత అకస్మాత్తుగా —170°C జారిపోవడంవల్ల మనిషి గడ్డ కట్టుకుపోయి!

(4 వ పేజీ తరువాయి)

ఫైల్లార్ స్పెక్ట్రా ఉత్పత్తివి గురించి ఇతడిచ్చిన వివరణ అమూల్యమైనది; ప్రాతిపదికమైనది. నక్షత్రమునకు మరియు అణువునకు మధ్య గల సంబంధాలు సూత్రీకరించాడు. ఫైల్లార్ స్పెక్ట్రాకు సంబంధించిన ఇతడి సాహా ఈక్వేషన్ నూతన ప్రపంచ విజ్ఞాన శాస్త్రానికి భారతదేశపు అమూల్యమైన కానుక. రేడియో తరంగప్రసారం, కండక్షన్ ఆఫ్ ఫ్లేమ్స్, ఫార్మేషన్ ఆఫ్ ఏరియాస్, విస్ఫోటనాత్మక ప్రతిక్రియ మొదలయిన సమస్యలకు ఇతడి అయొనైజేషన్ సిద్ధాంతం మిక్కిలి ఉపయుక్తంగా ఉంది. నక్షత్రాలు, అణువులు, అయాన్స్ మొదలైన విషయాలపై పరిశోధనలు చేశాడు.

పారిశ్రామికీకరణము, నేషనల్ ప్లానింగ్, రివర్‌వాలీ ప్రాజెక్ట్స్, అగ్రికల్చరల్ కో ఆపరేటివ్స్ మొదలగు వాటికి సంబంధించిన సమస్యలను గురించి ఇతడు రచనలు చేశాడు.

సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధి మరియు విజ్ఞాన శాస్త్రాభివృద్ధిపల్ల భారతదేశపు దారిద్ర్యానికి విమోచనం కలుగుతుందని ఇతడి అభిప్రాయం.

డా॥ సాహా సామాన్యుడు కాదు. ప్రగతి పూర్వకమైన ఉత్సాహవంతుడు ప్రజలు ఇతడి విజ్ఞానాన్ని మెచ్చి గౌరవించారు. 1952 లో లోక్‌సభకు సభ్యుడుగా (ఇండిపెండెంట్) ఎన్నుకోబడ్డాడు. ఎంతటి తీవ్రమైన విమర్శలనైనా చిరునవ్వుతో స్వీకరించేవాడు. డా॥ సాహా ఫిబ్రవరి 16 1[illegible] మరణించాడు.

# క్విజ్



1. క్రింది ఏఏ దేశాలలో ఏక పార్టీ పాలన (one party rule) ఫలితంగా ఏర్పడిన అశాంతి పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది?

(ఎ) సిరియా, (బి) పాపువా న్యూగినియా, (సి) జాంబియా, (డి) బర్మా.

2. క్రింద సూచించిన ఏ క్రీడతో కర్ణీ సింగ్‌కు (బికనీరు మహారాజా) సంబంధం ఉంది?

(ఎ) విలువిద్య, (బి) పోలో, (సి) షూటింగ్, (డి) గుర్రపు పందెము.

3. క్రింది భారతదేశపు ఏ రాష్ట్రంలో అత్యధిక భూప్రదేశం అడవులతో నిండి ఉంది?

(ఎ) తమిళనాడు, (బి) పంజాబ్, (సి) బీహార్, (డి) మధ్యప్రదేశ్.

4. ఇండియన్ ఎయిర్‌ఫోర్స్ ఎప్పుడు ఏర్పడింది?

(ఎ) 1928, (బి) 1932, (సి) 1936, (డి) 1939.

5. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా ఎన్ని సంవత్సరాల కొకసారి ప్రెసిడెంటును ఎన్నుకుంటుంది?

(ఎ) 7 సంవత్సరాలు, (బి) 5 సంవత్సరాలు, (సి) రెండు సంవత్సరాలు, (డి) 4 సంవత్సరాలు.

6. నేషనల్ డిఫెన్స్ అకాడమీ ఎక్కడ నెలకొల్పబడింది?

(ఎ) లక్నో, (బి) మహౌ (Mhow), (సి) రాంచి, (డి) ఖడక్‌వాసల.

7. క్రింది ఏ ఫిల్ముతో రాజ్‌కపూర్‌కు సంబంధం లేదు?

(ఎ) శ్రీ 420, (బి) ఆవారా, (సి) జ్యుయెల్‌థీఫ్, (డి) ఆగ్.

8. భారతదేశంలో అత్యధికంగా వార్తాపత్రికలు ప్రచురింపబడే భాష:

(ఎ) తెలుగు, (బి) ఇంగ్లీషు, (సి) హిందీ, (డి) గుజరాతీ.

## ప్రపంచంలో అన్ని దేశాల కంటే యుఎస్‌లో చట్టాలు అధికం

యుఎస్‌లో ఉన్నన్ని చట్టాలు మరెక్కడా లేవు. ప్రపంచంలో మొత్తం అన్ని దేశాల కంటే యుఎస్‌లో చట్టాలు చాలా అధికంగా ఉన్నాయి.

— 'ది ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

"అసహనాన్ని సహించగలగటమే సహనాన్ని

## తెలివికి పరీక్ష

1. త్యాగంతో ప్రారంభమై త్యాగంతో అంతమైన ఏ కథ ప్రపంచ ప్రసిద్ధిపొందింది?

2 నాటక రచయితగా ప్రసిద్ధిపొంది అనేక తెలుగు చిత్రాలకు మాటలు, పాటలు వ్రాసిన ప్రముఖ రచయిత కవి 'ఆచార్య ఆత్రేయ' పూర్తి పేరు చెప్పండి?

3. నీకంటే నీ స్నేహితుడు ఎక్కువగా ఉపయోగించే నీ స్వంతమైనది ఏది?

4. ఎప్పుడు నీవు రైలుతో సరిసమాన మైన వేగంతో వెళ్ళగలవు?

5. ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది?

99, 91, 75, 51 —

6. విష్ణువుకి మిక్కిలి ప్రీతికరమైన పుష్పాలుకాని పుష్పాలు ఎనిమిది? అవి ఏవి?

## మాటల మహిమ

1. మెరుము: ప్రకాశించు (ఎ), మెరపు (బి), కొట్టు (సి), పొడుచు (డి).

2. మొరుము: గరుకుగా ఉండే పిండి (ఎ), గులకరాయి (బి), మొరను (సి), మోసగించు (డి).

3. లయము: మోసము (ఎ), సంగీతంలో కాలము (బి), విరామము (సి), బుద్ధిమాంద్యము (డి).

4. లాస్యము: నృత్యము (ఎ), మత్తు (బి), వేశ్య (సి), బరువు (డి)

5. పెనుగు: కూడు (ఎ), కలియు (బి), ఎదురాడు (సి), పోరు (డి).

6. పేలు: పేడిచే పగులు (ఎ), పదరు (బి), కోపము (సి), మెత్తని (డి)

7. పొందిక: పొంకము (ఎ), స్నేహము (బి), చేరిక (సి), విధము (డి).

8. బాపురే: సంతాపార్థము (ఎ), ప్రశంసార్థము (బి), ఆశ్చర్యార్థము (సి), బరువు (డి).

(జవాబులకు — వ పేజీ చూడండి)

## విజయవంతమైన మొట్టమొదటి బెలూన్ ఫ్లైట్



జూన్ 5, 1783 న జె.ఎమ్. మరియు జె.ఇ. మాంట్ గోల్‌ఫైర్ అనే ఇద్దరు యోధులు మొట్టమొదట విజయవంతంగా 10 మీటర్ల వ్యాసం గల బెలూన్‌ను ఆకాశంలోకి పంపారు. వీరు పొగతో నింపిన ఈ పెద్ద బెలూను ఆకాశంలోకి 300 మీటర్ల పైకి ఎగిరి అక్కడ 10 నిమిషాలపాటు గాలిలో తేలుతూ ఉంది.



**అలెగ్జాండర్ ది గ్రేట్ (356-323 BC):**

గ్రీసు మరియు మాసిడోనియాను పాలించిన చక్రవర్తి. ప్రపంచంలో ప్రసిద్ధిపొందిన గొప్ప మిలటరీ నాయకుడు. తాత్త్వికుడైన



ALEXANDER

అరిస్టాటిల్ ఇతడికి విద్య నేర్పించాడు. ఈజిప్టులో ఇతడు నిర్మించిన అలెగ్జాండ్రియా నగరం విద్యాభివృద్ధికి వ్యాపారానికి సుప్రసిద్ధ కేంద్రంగా రూపొందింది. 331 బి సి లో ఇతడు చరిత్రలో మహాయుద్ధంగా పేరుపొందిన అర్బెలా యుద్ధంలో పర్షియాకు చెందిన బలాలిన్, పెర్సెపోలిస్ నగరాలను స్వాధీనం చేసుకుని డేరియస్‌ను ఓడించాడు.

* * *

**నాగుయిబ్ మహ్‌ఫౌజ్:**

వాఙ్మయాభివృద్ధికి 1988 నోబుల్ బహుమానం పొందిన ఈజిప్షియన్ రచయిత. 87 సంవత్సరాల అరబ్ చరిత్రలో గౌరవప్రదమైన బహుమానం పొందిన మొట్టమొదటి అరబ్బీ భాషాపండితుడు.

* * *

**లూయిస్ కరోల్ (1832-1898):**

గొప్ప ఆంగ్లేయ రచయిత మరియు గణిత శాస్త్రజ్ఞుడు. పిల్లలకొరకు మంచి హాస్యంతో, జానపద సంస్కృతి కల్పనతో వ్రాసిన 'ఆలిస్ ఇన్ వండర్ లాండ్' రచయితగా ప్రసిద్ధి పొందాడు. అంత్యప్రాసతో, అందమైన మాటలతో రచించిన ఇతడి నాన్‌సెన్స్ పద్యాలు "జాబెర్‌వాకీ" ముఖ్యంగా పిల్లలకు అపూర్వ ఆకర్షణను, ఆనందాన్ని కలిగించాయి.

* * *

**జాక్ డెంప్‌సే:**

ముష్టియుద్ధంలో పేరుపొందిన గొప్ప మల్లయోధుడు. 1919 నుండి 1926 వరకు హెవీ వెయిట్ బాక్సింగ్ చాంపియన్‌షిప్‌ను నిలబెట్టుకున్నాడు. గేటు దగ్గర మిలియన్ డాలర్లు వసూలైన మొట్టమొదటి మల్లయుద్ధ ప్రదర్శకుడు.

* * *

**డా. సి. నారాయణరెడ్డి (1931 జననం):**

తెలుగు యూనివర్సిటీ వైస్‌ఛాన్సెలర్. సింగిరెడ్డి నారాయణరెడ్డి (సినారె)

(మిగతా 14వ పేజీలో)



# ఒమాన్ సుల్తానేట్

అరేబియా ద్వీపకల్పానికి ఆగ్నేయ దిక్కుగా చిట్టచివర గల ఒక స్వాతంత్ర్య దేశం ఒమాన్ సుల్తానేట్. పూర్వం దీనిని మస్కాట్ మరియు ఒమాన్ అని పిలిచేవారు. తీరప్రదేశానికి సుదూరంగా ఉన్న కురియా, మురియా, మసిరాహ్ ద్వీపాలు



OMAN

కూడా ఇందులో చేరి ఉంటాయి. మొత్తం దేశం వైశాల్యం 2,12,457 చ.కి. మీటర్లు. దీని జనాభా 12,71,000. రాజధాని నగరమైన మస్కాట్ జనాభా 15,000. 18,000 జనాభాతో విలసిల్లే మిక్కిలి పెద్ద నగరం మాత్రా (Matrah) 1978 లో స్థాపించబడింది.

ఒమాన్‌కు వాయవ్యమూల నుంచి పర్వతశ్రేణి బయలుదేరుతుంది. మిగిలిన ప్రదేశమంతా నీరులేక పొడిగా ఉండే ఎండిపోయిన రాతిప్రదేశం. ఉత్తరదిక్కున ఒమాన్ జలసంధి చుట్టూ తీరప్రదేశం ఒకే సమంగా ఉండదు. ఉత్తరంవైపు గల్ఫ్ ఆఫ్ ఒమాన్, తూర్పు మరియు దక్షిణం వైపు అరేబియా సముద్రం ఉంది. తీర ప్రదేశం మొత్తం 1,500 కి.మీ.లు.

బాటినా (Batinah) ఉత్తర దిక్కుగా ఉండే తీరదేశం మిక్కిలి సారవంతమైనది.

## విస్డమ్ పాత కాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84 జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ ఆగస్టు '85, అక్టోబరు '85; జనవరి '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87 నుంచీ డిసెంబరు '87; జనవరి '88 నుంచీ డిసెంబరు '88; జనవరి '89 నుంచీ జూన్ '89 కాపీలు మా వద్ద ఉన్నవి. 1983 కాపీ వెల పై. 0.75 లు; 1984 కాపీల వెల రూ. 8.75 లు; 1985 కాపీల వెల రూ. 10.25; 1986కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీల వెల రూ. 20 25; 1989 కాపీల వెల రూ. 12.00 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5.00 లు చేర్చి M.O. పంపాలి—'రత్నా ఏజన్సీస్,' 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

“కనికరం చెవిటివారికి వినిపిస్తుంది, గ్రుడ్డివారికి కనిపిస్తుంది.”

జనసాంద్రత ఇక్కడ చాలా దట్టంగా ఉంటుంది. ఖర్జూరం, ఇతర పండ్లు, ధాన్యాలకు ఇది చాలా ప్రసిద్ధి చెందింది. దక్షిణ దిక్కుగా ఉన్న ధుఫార్ ఒక్కటే మరో సారవంతమైన ప్రదేశం.

మిగిలిన ప్రదేశమంతా ఎందుకూ పనికి రాని మెట్ట. పశ్చిమంగా సౌదీ అరేబియా సరిహద్దు రుబ్ అల్ ఖాలి, "ది ఎంప్టీ క్వార్టర్."



ఇది ఒక ఇసుక ఎడారి. ఇక్కడ జీవనదులు ఏవీ ప్రవహించడంలేదు.

మస్కాట్‌లో 21°C మరియు 48°C మధ్య ఉష్ణోగ్రత మారుతూంటుంది. దేశంలో సంవత్సరానికి సగటు వర్షపాతం 10 మి. మీ.లు మాత్రమే. ఒమాన్‌లో నివసించే వారు చాలామంది అరబ్బులు, మొత్తం జనాభాలో 90 శాతం. బెలూచీలు, ఇరానియనులు, నీగ్రోలు, ఇండియనులు, పాకిస్థానీయులు కూడా అక్కడక్కడ కనిపిస్తారు.

ఇక్కడ రాజభాష అరబిక్ ప్రధాన భాషగా ప్రవృద్ధి పొందింది. ఇస్లాం ఇక్కడి అధికార మతం. దేశంలో 'ఒమానీ రియాల్' చలామణిలో ఉంటుంది. వీరి జాతీయగీతం 'గాడ్ సేవ్ అవర్ సుల్తాన్'తో ప్రారంభమవుతుంది.

ఇక్కడ వారికి వ్యవసాయమే ముఖ్య వృత్తి. గోధుమలు, కాయగూరలు, పండ్లు, ఖర్జూరం, చెరకు, పప్పుధాన్యాలు మొదలైన వాటిని కృషిచేసి పండిస్తారు. ఫ్రాన్‌కిన్ సెన్స్ (Frankincense) అనే సువాసన ద్రవ్యాన్ని ఉత్పాదిస్తారు. చేపలు పట్టుట, పెరల్ డైవింగ్ కూడా ఇక్కడ అభివృద్ధి

---

క్విజ్ జవాబులు : 1. (డి) బర్మా, 2. (సి) షూటింగ్, 3. (డి) మధ్యప్రదేశ్, 4. (బి) 1932, 5. (డి) 4 సంవత్సరాలు, 6. (డి) ఇంక్‌వాసన, 7. (సి) జాయెల్ శివ్, 8. (సి) హిందీ.

తెలివికి పరీక్ష జవాబులు : 1. రామాయణం, 2. కిడాంబి నరసింహాచార్యులు, 3. నీ పేరు, 4. రైలులో కూర్చున్నప్పుడు, 5. 19, 6. అహింసా పుష్పం, ఇంద్రియ నిగ్రహ పుష్పం, సర్వభూత దయాపుష్పం, క్షమాపుష్పం, జ్ఞానపుష్పం, తపఃపుష్పం, ధ్యానపుష్పం, సత్యపుష్పం.

మాటల మహిమ జవాబులు : 1. ప్రకాశించు (ఎ) మెరపు (బి), కొట్టు (సి), పొడుచు (డి), 2. గరుకుగా ఉండే పిండి (ఎ), గులకరాయి (బి), మొరను (సి); 3. సంగీతంలో కాలము (బి), విరామము (సి), బుద్ధిమాంద్యము (డి); 4. నృత్యము (ఎ); 5. కూడు (ఎ), కలియు (బి), ఎదురాడు (సి), పోరు (డి); 6. వేడిచే పగులు (ఎ), పదరు (బి); 7. పొంకము (ఎ), స్నేహము (బి), చెలిక (సి), విధము (డి); 8. సంతాపార్థము (ఎ), ప్రశంసార్థము (బి), ఆశ్చర్యార్థము (సి).

"అపేక్షలు భిలాషలు లేకుండా చేసుకుంటే

పొందాయి. ఒంటెలను, ఇతర పశువులను పెంచుతారు.

ఖర్జూరం, ఎండుచేపలు, నిమ్మ మరియు ఇతర పండ్లు, పొగాకు, కాయగూరలు ఇచ్చటినుంచి ఎగుమతి చేస్తారు. ఇక్కడ


OMAN SULTAN

పెట్రోలియం నూనె పరిశ్రమ దేశ ఆర్థిక స్తోమతకు అధికంగా తోడ్పడుతుంది. నూనె ఉత్పాదన 1967 లో ప్రారంభమైంది. ముడి నూనె ఎక్కువగా ఎగుమతి చేస్తారు. సుల్తానేట్‌కి దీనిమీదే మంచి ఆదాయం లభిస్తుంది.

ప్రాచీనకాలంలో ఒమాన్ మీద పర్షియన్ ప్రభావం చాలా ఉంది అంటారు. 630 AD లో ఇచ్చటి జనం ముస్లిములుగా మారారు. పర్షియాకు (ఇప్పుడు ఇరాన్) ఒమాని జాతులమీద అధికారం తగ్గిపోయింది. 16 వ శతాబ్దంలో పోర్చుగీసు వారు అధికారం వహించారు. వారు ఒమాన్‌లో మస్కాట్ మీద అధికారం చలాయించడం ప్రారంభించారు. ఆనాడు ఒమాన్ హిందూమహాసముద్రపు ముఖ్య వ్యాపార కేంద్రం. కానీ వీరు 17 వ శతాబ్దంలో తరుమగొట్టబడ్డారు.

అరేబియన్ పెనిన్సులాలో ఈమెన్ (Yemen) కు చెందిన అహమ్మద్ ఇబిన్ సయ్యద్ అల్ బుసాయిదీ ఆఫ్ ఈమెన్ 1741 లో పాలకుడయ్యాడు. ఆ వంశమే నేటికీ పాలిస్తూంది. ఒకప్పుడు ఒమాన్ సుల్తానులు జాంజిబార్‌ను (ఇప్పుడు టాంజేనియాలో భాగం), తూర్పు ఆఫ్రికాలో కొన్ని ప్రదేశాలను, పర్షియన్ తీరం, బెలూచిస్థాన్ (ఇప్పుడు పాకిస్థాన్‌కు చెందిన రాజ్యం) లను పాలించారు.

20 శతాబ్దం ప్రారంభంలో ఒమాన్ బ్రిటిష్ సంరక్షణలోకి వచ్చింది. బ్రిటన్ ఈ రాజ్యంతో ఒక ప్రత్యేక సంబంధాన్ని కల్పించుకుంది.

ఇప్పుడు సుల్తాను ఆధునిక ప్రభుత్వాన్ని ఏర్పరచారు. నూనెమీద వచ్చిన ఆదాయం ప్రజాసంక్షేమానికి వినియోగించబడుతూంది. ఇతడు యునైటెడ్ కింగ్‌డమ్‌లో చదువుకున్నాడు. ప్రజాపరిపాలనకు తన దేశం ఇంకా పరిపక్వం చెందలేదని ఇతడి అభిప్రాయం.

## లోవాలో అక్షరాస్యుల సంఖ్య అత్యధికం

యునైటెడ్ స్టేట్స్‌లో మిడ్‌వెస్టర్న్ స్టేట్ లోవా మిక్కిలి సారవంతమైన ప్రదేశం. యునైటెడ్ స్టేట్స్‌లో ఇతర రాష్ట్రాలు అన్నిటిలో కంటే ఇక్కడ చదవనూ, వ్రాయనూ తెలిసిన అక్షరాస్యుల సంఖ్య అత్యధికం - 99.5 శాతం.

“ధైర్యసాహసాలు లేని ఉద్యమం దేన్నీ సాధించ లేదు.”

## వరుసగా అయిదు నెలల పాటు తుమ్ములు

యునైటెడ్ స్టేట్స్ ఫ్లోరిడాలో మియామికి చెందిన 17 సంవత్సరాల వయస్సు యువతి జనవరి 4, 1966 న ప్రారంభించి జూన్ 8, 1966 వరకు తుమ్ముతూనే ఉంది.

## మానవుని దవడ కండరాలు

మానవుని దవడలో కండరాలు 219 కి.గ్రా. పైగా శక్తిని ఉత్పాదిస్తాయి.

## ఒక టన్ను బొగ్గు అవసరం

ఒక టన్ను కాగితం తయారుచేయడానికి ఒక టన్ను బొగ్గు అవసరం ఉంటుంది.

## శుక్రవారంనాడు మాంసం తిన్నందుకు ఉరిశిక్ష

ట్యూడర్ చక్రవర్తి 8 వ హెన్రీ (16 వ శతాబ్దం) పరిపాలనలో లండన్‌లో శుక్రవారంనాడు మాంసం తిన్న మనిషిని ఉరితీసేవారు.

## ప్రపంచంలో 8 వ వంతు భూతలం

ఒక సంవత్సరంలో 8 వ వంతు భూతలం మీద 25 సెం.మీ.ల కంటే తక్కువ వర్షం కురుస్తుంది.

## బాగా చదువుకున్న వ్యక్తి

బాగా చదువుకున్న వ్యక్తి మాట్లాడేటప్పుడు 5,000 పైగా ఇంగ్లీషు మాటలను ఉపయోగిస్తాడు.

## సింగపూర్‌లో పెంట వినియోగ క్రమవిధానం


SINGAPORE

సింగపూర్‌లో రోజుకి సగటున చేరే 2500 టన్నుల పెంటను సక్రమంగా వినియోగం చేస్తున్నారు. దాంట్లో సగానికి సగం మంటపెట్టి ఆవిరిని, విద్యుత్ శక్తిని జనింప చేసుకుంటున్నారు. మిగిలిన సగం పల్లపు ప్రదేశాలను గోతులను చెరువులను పూడ్చడానికి ఉపయోగిస్తున్నారు. మంటపెట్టగా వచ్చిన బూడిదను రోడ్ల నిర్మాణానికి ఉపయోగిస్తున్నారు. పారిశ్రామికోత్పత్తిదారులు పనికిరాని వ్యర్థపదార్థాలను లాభసాటిగా వినియోగించుకోవాలి. వ్యర్థపదార్థాలుగా వచ్చే ద్రవాలను నీటిని శుభ్రపరచి నిరపాయకరంగా తటస్థవంతం చేయాలి.

—'ది రొటేరియన్' సౌజన్యంతో

"సకాలంలో సరైన దానిని చెప్పి, చెప్పిన దానిని సక్రమంగా చేయడమే నైపుణ్యం."

# స్టాంపుల కథ

**డి. విల్సన్**

ఈనాడు పోస్టేజి స్టాంపులు ప్రపంచమంతటా ఉపయోగిస్తున్నారు. 19వ శతాబ్దం వరకూ కూడా బ్రిటన్‌లో ఉత్తరాలు, పార్శిళ్ళు పోస్టింగ్ అంతా అవకతవకలుగా సాగేది. సక్రమంగా ఉండేది కాదు. పోస్టల్ రేట్స్ ఒక తీరుగా ఉండేవికావు ఉత్తరాలు



ROWLAND HILL

పంపేవారు పోస్టేజి ముందే కట్టవలసి వచ్చేది. లేకపోతే ఉత్తరాలు అందుకునే టప్పుడు అద్రసీ కట్టవలసి వచ్చేది. రేట్లు సాధారణంగా దూరాన్నిబట్టి లెక్కకట్టేవారు. మామూలుగా పంపేవారు కాకుండా ఉత్తరాలు అందుకునేవారే డబ్బు కడుతూండేవారు.

ఆ రోజులలో ఇంకా ఎన్వలెప్స్ (కవర్లు) వాడకంలోకి రాలేదు. పోస్టుద్వారా పంపవలసిన ఉత్తరంకాగితం మడతపెట్టి సీలుచేసి వెనకప్రక్క ఎడ్రసు వ్రాసేవారు. ముందుగా డబ్బుకట్టి ఉంటే పెయిడ్ గుర్తు లనే ముద్రలు చేతితో వేసేవారు. ఇది చాలా ప్రయాసగా, యాతనగా ఉండేది. పోస్టల్ రేట్లు కూడా చాలా ఎక్కువగా ఉండేవి ఉన్నట్లుండి అకస్మాత్తుగా బ్రిటన్‌లో పద్ధ విరుద్ధంగా అనేక రకాలుగా ఉత్తరాల రవాణా ప్రారంభమైంది. బ్రిటిష్ ప్రభుత్వం వారు దీనిని గ్రహించి పోస్టల్ రిఫారమ్స్‌కి సలహాలను కోరారు. రౌలండ్ హిల్ పోస్టేజి స్టాంపుల వాడుకను ప్రతిపాదించాడు. ఇతడు బర్మింగ్‌హామ్‌లో ఒక స్కూలు హెడ్ మాస్టరు. 1837 లో ఇతడు బ్రిటిష్ పోస్టల్ అభివృద్ధి విధానాన్ని వ్రాత మూలకంగా సూచించాడు. ప్రభుత్వంవారు దానిని మెచ్చుకుని ఆమోదించారు. ఆ సూచనలు ముఖ్యంగా రెండు:

1. పోస్టేజి రేటు దూరంఎంతైనా బరువుని బట్టి ఉండాలి.

2. హేండ్‌స్టాంప్ స్టాంపులకు బదులుగా ముందుగానే చార్జి చెల్లించి చిన్న చిన్న కపాలాబిళ్ళలు కొని లెటర్ల మీద అతికించాలి.

బ్రిటిష ప్రభుత్వంవారు రౌలండ్‌హిల్ సలహాలను ఆమోదించారు. స్టాంపు పరిమాణం, ఆకారం మార్చాలని సలహాలను కోరుతూ కాంపిటీషన్ నిర్వహించారు. దీనికి సుమారు 2,500 ఎంట్రీలు వచ్చాయి. వీటిలో 4 ఎంట్రీలకు ఒక్కొక్కరికి 100 పౌండ్ల (రూ. 1.800/-) బహుమానం ఇచ్చారు. కాని వీటిలో ఏ ఒక్కటీ కూడా ఉపయోగించలేదు. తిరిగి ప్రభుత్వంవారు రౌలండ్ హిల్‌ను సంప్రదించారు. రౌలండ్ హిల్ మెసర్స్ పెర్కిన్స్ బేకన్ అండ్ కో వారి సహాయంతో ప్రపంచంలో మొట్ట మొదటి స్టాంపును డిజైను చేశాడు.

"గౌరవం పొందినవారికి అపకీర్తి మరణముకన్న దుస్సహమైనది."

1834 లో మొదట జేమ్స్ చాల్మర్స్ వెలిబుచ్చిన అభిప్రాయాలను అనుసరించి దానికి అనుగుణ్యంగా రౌలండ్ హిల్ 1840 లో జిగురు రాసిన మొట్టమొదటి పోస్టేజి స్టాంపును ప్రవేశపెట్టాడు. పోస్టల్ చార్జీని ముందే చెల్లించినట్లు ఇది తెలియ జేస్తుంది. దూరంతో ప్రమేయం లేకుండా లెటర్ భారాన్ని బట్టి విలువ మారుతూం టుంది. బ్రిటన్ దేశపు విక్టోరియా మహారాణి




బొమ్మ ఉన్న ఈ నల్లటి స్టాంపు విలువ ఒక పెన్నీ.

ప్రపంచంలో మొట్టమొదటి ఈ పోస్టేజి స్టాంపును మే 6, 1840 న ఉపయోగించ డానికి మే 1 న అమ్మకం ప్రారంభించారు. మొత్తం 6 81,68,080 స్టాంపులు అమ్మ వేశారు. బ్రిటిష్ నేషనల్ పోస్టల్ మ్యూజి యంలో ఇప్పుడు 1840 ఏప్రిల్ మాసంలో అమ్ము కావింపబడిన 240 పెన్నీ నల్ల స్టాంపుల షీటు ఒకటి భద్రపరచబడింది.

1843 లో స్టాంపులను విడుదల చేసిన రెండవ దేశం బ్రెజిల్ (దక్షిణ అమెరికా). తరువాత క్రమంగా అనేక దేశాలు స్టాంపు లను జారీ చేయడం ప్రారంభించాయి. 1847 కు ముందే యునైటెడ్ స్టేట్స్‌లో కొన్ని నగరాల పోస్టుమాస్టర్లు ప్రత్యేకంగా వారి స్టాంపులను విడుదలచేశారు. యునై టెడ్ స్టేట్స్‌లో అధికారపూర్వకంగా అఫిషి యల్ స్టాంప్ ఆగస్టు 1847 లో విడుదలైంది. బెంజామిన్ ఫ్రాంక్లిన్, జార్జి వాషింగ్‌టన్ బొమ్మలతో ఈ స్టాంపులు వెలువడ్డాయి.

భారతదేశంలో పోస్టల్ విధానం పోస్టాఫీసు చట్టం అమలులోకి వచ్చిన తరు వాత 1837 లో ప్రజల ఉపయోగానికి ప్రారంభమైంది. ఈ చట్టం ప్రకారం భారత దేశం అంతటా పోస్టల్ సర్వీసులకు ప్రభుత్వంవారిదే అధికారం. చట్టం ప్రకారం ప్రైవేటు పోస్టల్ సంస్థలు నిషేధింప బడ్డాయి.

(8 వ పేజీ తరువాయి)

సుప్రసిద్ధ తెలుగు కవి. 1968-83 మధ్యకాలంలో మంటల్లో మానవుడు, విశ్వం భర వంటి విశిష్ట కావ్యాలను రాసినందుకు 1988 సంవత్సరం జ్ఞానపీఠ్ అవార్డు లభిం చిన రెండవ సాహితీవేత్త. (1970 లో విశ్వనాథ సత్యనారాయణగారికి లభించింది) ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్‌గా కూడా పనిచేశారు. వీరి విశ్వంభర కావ్యానికి కుమరన్ ఆసన్ (కేరళ), భిల్వారా (భారతీయ భాషాపరిష త్తు, కలకత్తా) సోవియెట్ లాండ్ (నెహ్రూ) మొదలైన అవార్డులు ఎన్నో లభించాయి. 3000 లకు పైగా సినిమాలకు పాటలు వ్రాసి ప్రసిద్ధి పొందారు

''[illegible] శత్రువు. కాబట్టి మానవుడు

సింధు (పాకిస్థాన్‌లో ఇప్పటి సింధు) కమిషనర్ అయిన బార్టిల్ ఫ్రేరీ జూలై 1, 1852 న కరాచీలో మొట్టమొదటి స్టాంపును ప్రవేశపెట్టాడు. ఇవి సింధ్‌లో మాత్రమే చెల్లేవి. వీటిని సింధ్ డాక్స్ అనేవారు. స్టాంప్ మధ్య భాగంలో బ్రిటిష్ ఈస్ట్ ఇండియావారి వెడల్పాటి బాణం గుర్తు ఉండేది. తెలుపు, నీలం, ఎరుపు మూడు ప్రత్యేక రంగులలో అర్ధ అణా విలువలో










లభించేవి. వీటిని ఈస్ట్ ఇండియా కంపెనీ వారు అంగీకరించలేదు. అక్టోబరు 1854 లో వాటిని తీసివేశారు. 854 లో ఈస్ట్ ఇండియా కంపెనీ పోస్టల్ సేవలను ఒక ప్రత్యేక విభాగంగా డైరక్టర్ జనరల్ ఆఫీసులో ప్రారంభించారు. ఆల్ ఇండియా విధానంలో స్టాంపులు విడుదల చేశారు. సాధారణ ఉపయోగానికి అక్టోబరు. 1, 1854 లో జారీచేసిన మొట్టమొదటి స్టాంపులు ½ అణా, 1 అణా, 2 అణాలు, 4 అణాల విలువలలో ఉండేవి. ఈ స్టాంపులకు గానీ, సింధ్ స్టాంపులకు గానీ చిల్లులు (పెర్ఫొరేషన్స్) ఉండేవి కావు పోస్టుమాస్టరు ఒక కత్తెరతో వీటిని కత్తిరించవలసి వచ్చేది.

1926 లో నాశిక్ (మహారాష్ట్ర)లో ఇండియా సెక్యూరిటీ ప్రెస్ స్థాపింపబడింది. పోస్టేజి స్టాంపులను అచ్చువేయడం వీరికి అప్పగించారు. 1926 వరకు ఇండియన్




స్టాంపులు లండన్ (ఇంగ్లండ్)లో అచ్చు కావింపబడేవి.

బ్రిటిష్ పరిపాలనా కాలంలో పోస్టల్ డిపార్ట్‌మెంటువారు 1931 నుండి (జ్ఞాపకార్థం ప్రత్యేకమైన) కమ్మెమొరేటివ్ స్టాంపులను విడుదల చేయడం ప్రారంభించారు. స్వాతంత్ర్య భారతదేశంలో 1947 నుండి అనేక కమ్మెమొరేటివ్ స్టాంపులను విడుదల చేశారు. మార్చి 1972 లో నాశిక్ సెక్యూరిటీ ప్రెస్‌లో మల్టీ కలర్ ప్రింటింగ్ మెషీన్ ఏర్పాటు చేయబడింది. దీని సహాయంతో ప్రభుత్వంవారు అందమైన స్టాంపులు ప్రింటు చేయడానికి వీలు కలిగింది. పోస్టల్ డిపార్ట్‌మెంట్ వారు అంతర్జాతీయ స్టాంపుల ప్రదర్శనలలో పాల్గొంటూ దేశంలో కూడా స్టాంపుల ప్రదర్శనలను ఏర్పాటు చేస్తున్నారు.

"ఫిలేటలీ" స్టాంపుల సేకరణ హాబీ,

''ఉ... ...న్ని చంపుకుని అధైర్యపడకు,

ఊరికే స్టాంపులను సేకరించడమే కాదు. ఇది ఒక విధమైన బుద్ధికుశలతతో కూడిన అలవాటు. ప్రపంచంలో మొట్టమొదట పోస్టేజి స్టాంపుల సేకరణ ఒక ఇంగ్లీషు మహిళ ప్రారంభించింది. ప్రపంచంలో



వివిధ దేశాల స్టాంపులను కొంటానని 1841 లో లండన్ టైమ్స్‌లో అడ్వర్టైజ్‌మెంట్ ప్రచురించింది. ఆల్బంలో వాటిని అతికించడానికి కాదు పడక గదిని అలంకరించుకోడానికే ఆమె స్టాంపులను సేకరించేది.

లండన్ బ్రిటిష్ మ్యూజియంలో అంతర్జాతీయ స్టాంపుల సేకరణ అత్యద్భుతంగా ఉంటుంది. 1963 లో పర్మనెంట్ లోన్‌మీద జనరల్ పోస్ట్ ఆఫీసు సేకరణలను ఇక్కడ భద్రపరచారు.

అక్టోబరు 9, 1874 న స్థాపింపబడిన యూనివర్సల్ పోస్టల్ యూనియన్ సేకరణలు జెనీవాలో ఉంది. ప్రతి దేశంలో విడుదలైన ప్రతి స్టాంపు 400 కాపీలు జెనీవాకు చేరతాయి.

స్విస్, స్వీడిష్, జర్మన్, డచ్, యునైటెడ్ స్టేట్స్ (స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూషన్)లలో పోస్టల్ మ్యూజియంలు ఉన్నాయి.

బ్రిటిష్ గయానాలో (దక్షిణ అమెరికాలో ఇప్పుడు గుయానా) ఫిబ్రవరి 1856 లో విడుదలైన ఒక పెంట్ బ్లాక్ మజెంటా స్టాంప్ మిక్కిలి విలువైనది. ఎల్. వెర్నాన్ వాగన్ దీని విలువ తెలియక తన దగ్గర ఉన్న ఈ స్టాంపును 1873 లో 84 పెంట్లకు అమ్మాడు అది ఇప్పుడు రూ. 10 మిలియను పైగా విలువ చేస్తుంది.

## ఒకే కాన్పులో నలుగురు పుట్టడం దైవఘటన

ఒకే కాన్పులో నలుగురు పిల్లలు (Quadruplets) పుట్టడం కేవలం దైవఘటన. ప్రతి 6,00,000 కాన్పులకు ఒక కాన్పుకి ఇలా సంభవించే సూచనలు ఉన్నాయి.

---

## ఉబ్బస రోగులకు సహాయపడే సరిక్రొత్త పరికరము

ఉబ్బస రోగులు అతి సులభంగా ఊపిరి తీసుకోడానికి మాస్కోలోని ఇగోర్ లుయికేవిచ్ (Igor Liukevich)అనే సోవియెట్ ఇంజనీరు ఒక క్రొత్త పరికరాన్ని రూపొందించారు. ఒక థర్మామీటర్ వంటి పరికరానికి వంచడానికి వీలైన గొట్టం తగిలించబడి ఉంటుంది. ఈ గొట్టానికి అమర్చిన మౌత్ పీసుకు గల రంధ్రాన్ని చిన్నది పెద్దది చేయడంవల్ల ఊపిరి పీల్చుకోడం వదలడం క్రమబద్ధమవుతుంది.

''కొన్ని పరాజయాలు విజయాలను మించిన దిగ్విజయాలవుతాయి.''

డా. కె. నారాయణన్

నోటిలో పళ్ళు కట్టించుకోడం ఏనాడో రోమనులకు పూర్వం బి.సి. 8-6 శతాబ్దాలలో ఉత్తర మధ్య ఇటలీ ఎట్రుస్కాన్స్ (Etruscans) కాలంలోనే ప్రారంభమైంది. ఎముకతోను, ఏనుగుదంతంతోను, బంగారంతోను తయారుచేసిన పళ్ళు కట్టబడిన మానవుల పుర్రెలను పురాశిల్ప వస్తు శాస్త్రజ్ఞులు బి.సి. 700 లో కనుగొన్నారు. ఊడిపోయిన దంతాలకు బదులుగా కృత్రిమ దంతాలకు వివిధవస్తువుల వాడకం అనేక శతాబ్దాల నుంచి వాడుకలో ఉంది. ప్రాచీన కాలంలో ఎద్దుల, ఆవుల దంతాలు, హిప్పోపొటమస్ దంతాలు, సముద్రపు జంతువుల దంతాలు సామాన్యంగా వాడుతూండేవారు. ఏనుగుదంతం అనేక శతాబ్దాలనుంచి వాడుతూన్నా ఫలితాలు అంత సంతృప్తికరంగా కనిపించలేదు. ఏనుగుదంతంతో తయారుచేసిన పళ్ళు రంగు మారడమే కాకుండా దుర్వాసన రావడంవల్ల ఇది అంతగా ప్రసిద్ధి పొందలేదు.



అంగాల మార్పిడిలో ముఖ్యంగా నోటిలో దంతాలు కట్టించుకోడం ఒక ఫాషన్ అయింది. మరణించినవారి నోటిలో దంతాలు (నెపోలియన్ యుద్ధాలు, అమెరికన్ సివిల్‌వార్ వల్ల కావలసినంత సరకు లభించింది) లేక బ్రతికి ఉన్న ఇతర మానవుల నోటినుంచి తీసిన దంతాలు ఉపయోగించేవారు. ముఖ్యంగా కూటికి, గుడ్డకు కరువైన పేదవారు ఈనాడు కిడ్నీలు, కళ్ళు అమ్ముకుంటూన్నట్టు ధనవంతులకు తమ దంతాలను అమ్ముతూండేవారు. బంగారం, వెండి, ఎగేట్‌తో కూడా పళ్ళు కట్టేవారు.

ముఖ్యంగా ముఖ సౌందర్యం కోసమే కృత్రిమ దంతాలు పెట్టుకునేవారు. ఎప్పుడూ నోట్లో కట్టుడుపళ్ళు పెట్టుకొనడం బాధాకరంగా ఉండేది. అందుచేత ఆహారం తినేటప్పుడు ఇతర సమయాలలోను వీటిని తీసి వేయవలసి వచ్చేది. బ్రిటన్‌దేశపు 1 వ ఎలిజబెత్‌రాణి నోటిలో ముందు పళ్ళు ఊడిపోయినా కృత్రిమదంతాలు ఎన్నడూ వాడలేదు. కాని దంతాలు పోవడంవల్ల లోపలకు నొక్కుకుపోయిన బోసినోరుతో, అందవికారంగా కనిపించకుండా ఉండడానికి నోటిలో గుడ్డపీలికలు పెట్టుకుని రాచకార్యాలలో పాల్గొంటూండేది.

నేడు కృత్రిమదంతాలు అతి ఖచ్చితంగా సరిసమానంగా నోటిలో వప్పేటట్టు తయారు చేస్తున్నారు. ఇప్పుడు ఈ పళ్ళు పింగాణీతో తయారు చేస్తున్నారు. ప్లాస్టిక్ ఎక్రైలిక్ రెసిన్‌తో కూడా చేస్తున్నారు. దంతాలకు

"బాహ్యంగా ఆచరించే కార్యాలకు అంతర్యంగా జరిగే భగవత్ స్ఫురణ పునాది."

ఏమీ అంటుకోకుండా తరచుగా దంతాలకు పోలీటెట్రా ఫ్లోరోథిలీన్ (PTFE) పూత పెడతారు.

డెంటిస్ట్ (దంతవైద్యుడు) అనే పదం నేడు విస్తృతార్థంలో ఉపయోగిస్తున్నారు. దంత వైద్యం నానావిధాలుగా ప్రవృద్ధి పొందుతూంది. ఆర్థోడోంటిస్టు (orthodontists) లు నోటిలో పళ్ళసంకరను తీర్చి సరిచేస్తారు. ఓరల్ సర్జన్స్ (oral surgeons) నోటిలో పళ్ళను తీస్తారు. దౌడలకు, నోటిలో ఇతర భాగాలకు శస్త్రవైద్యం చేస్తారు. పెడోడోంటిస్టులు (Pedodontists) చిన్న పిల్లలకు దంతవైద్యం చేస్తారు. పిరియోడోంటిస్టులు (Periodontists) ముఖ్యంగా పంటిచిగుళ్ళకు వైద్యంచేస్తారు. ప్రోస్థోడోంటిస్టులు దంతాలు తయారుచేస్తారు, పళ్ళ లోపల వైద్యం చేసేవారు ఎండోడోంటిస్టులు.

ఆధునిక దంతవైద్యం మానవునికి ఎంత సౌకర్యం కలిగించినా దంతక్షయం అనేది ఒక పెద్ద రోగంగా ప్రబలిపోతూంది దీనికి వాక్సిన్ (టీకామందు) తయారీ ఒకటే సవాలు.

దంతక్షయాన్ని మనలో చాలామంది నిర్లక్ష్యంచేస్తారు. పళ్ళ పైభాగంలో ఎనామిల్ (తెల్లటి పదార్థం) పైపూతగా ఏర్పడి ఉంటుంది. మానవ శరీరంలో ఇదే మిక్కిలి బలిష్ఠమైనది. దంతవైద్యుడు ఉపయోగించే డ్రిల్ (రంధ్రంచేసే సాధనం) నిమిషానికి అరమిలియనుసార్లు అతివేగంగా తిరిగితేగానీ దంతాన్ని తొలచలేదు. ఇంత గట్టి ఎనామిల్‌ను కూడా సూక్ష్మాతి సూక్ష్మమైన బాక్టీరియా ఇట్టే నాశనం చేస్తుంది. పంచదారవల్ల ఈ సూక్ష్మజీవులు ప్రవృద్ధి చెందుతాయి. ఈ చక్కెర నోటిలో ఆమ్లంగా తయారై గట్టి ఎనామిల్‌ను పాడుచేస్తాయి. దంతక్షయం ఏర్పడుతుంది. చక్కెర తక్కువగా తినడంవల్ల, నోటిని ఎప్పుడు శుభ్రంగా ఉంచుకోవడంవల్ల దంతక్షయాన్ని నివారించుకోవచ్చు.

## నమస్తే నమ్రతను సూచిస్తుంది



భారతీయ సంస్కృతిలో అభివందన విధానం సార్థకమైన సాంప్రదాయం. ఇది మానవ నిర్మితమైన వర్ణ, కుల, జాతి, మత దేశ విచక్షణారహితమైన స్నేహ సౌహార్దాన్ని ప్రకటిస్తుంది. నమస్తే 'నీలో అధిష్ఠించిన దేవతామూర్తిని చూడగలుగుతున్నాను' అనే నమ్రతాభావాన్ని తెలియజేస్తుంది.

— ఎ. కె. కృష్ణనంది

"జీవితానికి శోభాయమా

## ఉన్నత అర్హతలు పొందిన పోలీసు దళము

చైనాలో ఆధునీకరణోద్యమ అవసరాలకు అనుగుణ్యంగా ఉన్నత అర్హతలు పొందిన పోలీసు దళానికి తగిన శిక్షణ ఇవ్వబడుతుంది. క్రొత్తగా చేర్చుకోబడే వాళ్ళందరూ పోలీసు స్కూలు పట్టభద్రులుగా ఉంటారు. ఆఫీసర్ల విద్యార్హత అధమం సీనియర్ సెకండరీ స్కూలు వరకు ఉండటానికి దేశంలో పోలీసు దళం పూర్తిగా తిరిగి స్కూలుకు పంపబడు తుంది.

* * *

## బ్రిటన్‌లో 4,000 భారతీయ హోటళ్ళు

బ్రిటన్‌లో సుమారు 4,000 భారతీయ హోటళ్ళు ఉన్నాయి. చైనా ఆహార విధానం కన్నా భారతీయ ఆహార విధానం ఇక్కడ బాగా ప్రసిద్ధిపొందింది. ఇక్కడ సాలీనా 400 భా ర తీ య హోటళ్ళు తెరవబడు తున్నాయి.

—'పాట్ చాప్‌మన్ సంపాదకత్వంలో గుడ్ కర్రీగైడ్' సౌజన్యంతో

* * *

## మంచినీటి శుభ్రతను నియంత్రించడానికి కేంద్రాలు

భారతదేశమంతటా 29 నదులలో మంచి నీటిని నియంత్రించి పరిశుభ్రతను కాపాడ డానికి సెంట్రల్ బోర్డ్ ఫర్ ప్రివెన్షన్ అండ్ కంట్రోల్ ఆఫ్ వాటర్ పొల్యూషన్ వారు వివిధ కేంద్రాలను స్థాపిస్తున్నారు. ఇప్పటికే అటువంటి కేంద్రాలు 200 ఏర్పాటు చేయబడ్డాయి.

## అగ్ని పరీక్ష



ఏదైనా సందేహం కలిగిందా నీకు - ఎదురైన దీనాతి దీనుడైన ఒక నిరుపేద వ్యక్తిని జ్ఞాపకం చేసుకో. నీవు చేయదలచుకున్నది అతడి కేమైనా ఉపయోగపడుతుందేమో మనసులో ఆలోచించి చూడు. దీనివల అతడి కేమైనా లబ్ధి ఉంటుందా? అతడి అదృష్టాన్ని నియంత్రించగలదా? పరీక్షపల్లే నీ కొత్త ప్రణాళికలకు, వ. అర్థం ఉంటుంది.

—గాంధీజీ

''ఇతరులను విమర్శించే ముందు నీ అంతరాత్మను నీవు పరిశీలించుకో.''

## 50,000 ఉత్తర ఫర్ సీలులు మరణిస్తున్నాయి:

ప్లాస్టిక్ వల్ల సముద్రప్రాణులకు అపారమైన తీరని నష్టం సంభవిస్తూంది. టైమ్ పత్రికవారి సమాచారాన్నిబట్టి ప్రిబిలాఫ్ (Pribilof) దీవులలో సాలీనా 50 000 ఫర్ సీలులు వలలలో చిక్కుకుని నశించి పోతున్నాయి. చిన్న చిన్న ప్లాస్టిక్ సామానులు, వస్తువులు ఎర అనే భ్రమతో తిన్న అనేక తాబేళ్ళకు, పక్షులకు మారక పరిస్థితులు ఏర్పడుతున్నాయి. సుమారు 42 రకాల సముద్రపు పక్షులు ఈ ప్లాస్టిక్ పదార్థాలను తినడంవల్ల వాటికి జీర్ణకోశంలో ఆటంకం కలిగి పుళ్ళు ఏర్పడుతున్నాయి.

* * *

## ప్రాచీన రోములో స్పీడ్ నిరోధక బ్రేకర్లు

ప్రాచీన రోములో వేగ నిరోధక నియామాలను ఇప్పటివాళ్ళలాగే ఎవ్వరూ లెక్కచేసేవారు కాదు. కానీ వాళ్ళు రోడ్డు దాట సి వస్తే పెద్దరాళ్ళు అడ్డుగా ఉండడంచేత [illegible]గత్తగా వాటిని తప్పించుకుని వెళ్ళవలసి [illegible]ది. లేకపోతే వారి బండి చక్రాలు విరిగి అపాయం సంభవించేది.

* * *

## అంధులకు ఉపకరించే సాధనం:

ప. జర్మనీ క్లాస్థాల్ (Clausthal) టెక్నికల్ యూనివర్శిటీలో పారిశ్రామిక రోబోటులను నియంత్రించడానికి తయారు చేసిన సాధనాన్ని గుడ్డివారికి సహాయపడడానికి వినియోగిస్తున్నారు. దీనికి ముందు భాగంలో ఫోటో సెన్సిటివ్ సెన్సార్ అమర్చబడి ఉంటుంది. ఇది పరిశీలనా పరిధిలో గల వస్తువుల రూపురేఖలను కనిపెట్టి చేతికి తగిలించిన కంకణమువంటి సాధనం ద్వారా విద్యుత్ప్రేరణల రూపంగా సమాచారాన్ని పంపుతుంది.

## జీవితంలో ఉన్నతాదర్శాన్ని అలవాటు చేసుకోవాలి



మానవుని జీవితం ప్రాపంచికంగా విజయవంతంగా లేకపోయినా శ్రేష్ఠమైన ఉన్నతాదర్శాన్ని కలిగి ఉండాలి. ఆ శ్రేష్ఠ గుణం న్యాయశీలతవల్ల లభిస్తుంది. న్యాయశీలత మనస్సుకి, ఆత్మకి చెందుతుంది. న్యాయబుద్ధివల్ల నిత్యజీవితంలో నిశ్చింతగా ఉండవచ్చు. న్యా[illegible]

"జవగలి ఎవ్వరికీ దాట తరం కాదు."

## 56,550 డాలర్లు నష్టపరిహారం:

విమానంలో ప్రయాణం చేస్తూన్న ఒక ప్రయాణీకుని తలమీద ప్రమాదవశాత్తు ఒక స్టూవార్డెస్ వేడి వేడి టీ పోసినందుకు ప. జర్మనీ ఎయిర్‌లైన్ లుఫ్తాన్సా 56,550 డాలర్ల నష్టపరిహారం చెల్లించవలసిందని కోర్టువారు ఆదేశించారు. అబ్దుల్ వహాబ్ బిన్ హర్మాన్ ఫ్రాన్క్‌ఫర్ట్ నుంచి ప. ఆసియాలో బహారెయిన్‌కి విమానంలో ప్రయాణం చేస్తూండగా ఈ ప్రమాదంవల్ల గాయాలు ఏర్పడి 3 నెలలపాటు చికిత్సను పొందవలసి వచ్చింది.

* * *

## ఆసియాలో అత్యుత్తమమైన స్కీయింగ్ విడిది

గార్వాల్ (Garhwal) హిమాలయ పర్వతాలలో అందమైన మంచుకొండల వాలులతో, సహజ సుందరమైన ప్రకృతి దృశ్యాలతో ఆలి (Auli) ఆసియాలో స్కీయింగ్‌కి (Skiing)కి గొప్ప విడిదిగా ఏర్పడింది. 3 కి మీ. పొడవైన ఆలీ వాలులలో నందాదేవి, కామెట్, మానా పర్బత్, దునగిరి శిఖరాలు ఉన్నాయి.

## ఆసియాలో మొట్టమొదటి స్పేస్-మాస్టర్ ప్లానెటోరియం

గుజరాత్ బరోడాలో రూ. 35 లక్షల వ్యయంతో నిర్మించబడిన స్పేస్ - మాస్టర్ ప్లానెటోరియం ప్రపంచంలో పదవది. ఇది మానవ సహాయంతో తిరుగుతూన్న అంతరిక్ష నౌకల సమాచారాలను అందజేసుంది.

## జీవసంహారక క్రిమినాశిని:

కలకత్తాలో బోస్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ప్రొ. ఫరుల్ చక్రవర్తి అనే శాస్త్రజ్ఞుడు పసిఫిక్ మహాసముద్రంలో జీవించే క్రిములనుండి వేరుచేసిన నెరీస్‌టాక్సిన్ (Nereistoxin), శక్తివంతమైన జీవసంహారక క్రిమినాశిని మందును తయారు చేయడానికి పరిశోధకులకు సహకరించిందని అంటున్నాడు.

## రైనోల రక్షణకు 'ఆపరేషన్ స్ట్రాంగ్ హోల్డ్'



అంతరించి పోతూన్న జాతిలో 500 రైనోలు మాత్రమే ఉన్న జింబాబ్వే జాంబోయలో విరామంగా సాగుతూన్న రైనోల వేటను అరికట్టి, రైనోలను సంరక్షించడానికి ఆపరేషన్ స్ట్రాంగ్‌హోల్డ్ ప్రారంభించబడింది. వేటగాళ్ళు రోజుకి ఒక రైనో చొప్పున చంపేస్తున్నారు. 'ఆప. స్ట్రాంగ్‌హోల్డ్'ను అనుసరించి వేటగాడు కనిపిస్తే తుపాకీ పేల్చి చంపేస్తారు.

—'సి.ఇ.ఇ. ఎస్ ఎస్ ఎస్' సౌజన్యంతో

### నిమ్మ

అన్ని రకాల నొప్పులు, బాధలు తగ్గుతాయి. చర్మంమీది నల్లమచ్చలు, ముడతలు పోతాయి. చర్మాన్ని ఆరోగ్యవంతంగా సహజకాంతితో ప్రకాశింపజేస్తుంది. తలలో చుండ్రు నివారణకు ఉపయోగపడుతుంది. జీర్ణశక్తివృద్ధి కలిగిస్తుంది. శరీరంలో క్రొవ్వును చేరనీయదు. అనేక దంతరోగాలకు ఔషధంగా ఉపయోగపడుతుంది. గొంతునొప్పి మరియు ఇతర నోటి రోగనివారణకు ఉపయోగించవచ్చు.

* * *



### ముల్లంగి

మలబద్ధతను నివారిస్తుంది. కంటి పొర మరియు క్షయ నిరోధకారి. శరీరం లావెక్కనీయదు.

* * *

### ఉల్లి

ఉబ్బస రోగులకు ఉపయోగకారి. దగ్గు, జలుబు, నిమోనియా, ఇన్ఫ్లుయెంజా రోగాలకు ఉపయోగపడుతుంది. బ్లడ్ ప్రెషర్ బాగా తక్కువగా ఉన్నప్పుడు ఇది ఎంతో సహకరిస్తుంది. లావును తగ్గిస్తుంది. మంచి నిద్రను కలిగిస్తుంది. ప్లేగులలో క్రిములను నశింపజేస్తుంది.

## 7 సంవత్సరాల బాలుడు నవ్యకల్పనాచతురుడు

యునైటెడ్ స్టేట్స్ పెన్సిల్వేనియాలోని షూ-లెన్‌బర్గ్‌లో సెంట్ రోజ్ ఆఫ్ లిమా స్కూలులో విద్యార్థి సచిన్ పటేల్ 7 సంవత్సరాల అతి చిన్నవయస్సులో గొప్ప నవ్యకల్పనా చతురుడు అనిపించుకున్నాడు. 'అంతరిక్షం నుంచి సౌరశక్తి' (Solar energy from space) అనేది ఇతడి అపూర్వ యోజన. కృత్రిమ ఉపగ్రహంలో అమర్చిన బ్రహ్మాండమైన మిక్కిలి పెద్ద అద్దం సూర్యకాంతిని నిరంతరం భూమిమీదికి ప్రతిఫలింప చేస్తుంది అనే విషయాన్ని కని పెట్టాడు. ఇన్వెంట్ అమెరికా కాంటెస్టులో ఇదే ఉత్తమమైనదిగా పరిగణించబడింది. ఇతడు తయారుచేసిన దాని నమూనా వాషింగ్టన్ డిసి స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూషన్‌లో ప్రదర్శించబడుతోంది. ఇది సూర్యకాంతిని సౌరాగ్ని కుండం (Solar furnace) లోకి ప్రతిఫలింపజేసే పెద్ద అతిపరవలయ (Parabolic) పు అద్దంతో కక్ష్యలో తిరుగుతూన్న భూస్థావరాన్ని (ఎర్త్ స్టేషన్) చూపిస్తుంది. ఈ కుండంలో జనించిన ఆవిరి సహాయంతో తిరిగే టర్బైన్ విద్యుచ్ఛక్తిని జనింప చేస్తుంది. 'స్పేస్' సౌజన్యంతో

### టొమాటో

శరీర చర్మం ఆరోగ్యాన్ని నిలబెట్టి రక్తాన్ని శుభ్రపరుస్తుంది. క్షయ, అధిక రక్తపోటు, సైనస్, కీళ్ళనొప్పులు, వాతం మొదలైనవాటి నివారణకు ఉపయోగపడుతుంది. మూత్రకోశంలో రాళ్ళను కరిగింపజేస్తుంది. లావెక్కనీయదు. కడుపులో గాలిని చేరనీయదు.

* * *

### దోస

దోసరసం నోటిలో దంతాలను, చిగుళ్ళను గట్టిపరుస్తుంది. తలమీద జుట్టు పెరగడానికి సహకరిస్తుంది. కాళ్ళ నొప్పులను తగ్గిస్తుంది.

### అనాస

గొంతుకమీద కణతలకు, దగ్గుకు, రక్తపుపోటుకు, కీళ్ళనొప్పులకు ఔషధంగా ఉపయోగపడుతుంది.

* * *

### బొప్పాయి

మంచి జీర్ణాభివృద్ధిని కలిగిస్తుంది. ప్రేగులను శుభ్రపరుస్తుంది. అంటురోగాలను నిరోధిస్తుంది.

* * *

### నారింజ

దగ్గును, ఉబ్బసపు దగ్గును నివారిస్తుంది. క్షయ, నిమోనియా, కీళ్ళ జబ్బులు, అధిక రక్తపుపోటు మొదలైనవాటిని నిర్మూలిస్తుంది.

* * *

### కాబేజి

కాన్సర్ నిరోధకము. నోటి చిగుళ్ళ వెంట రక్తం కారుటను నిరోధిస్తుంది.

—'హెల్త్' సౌజన్యంతో

## నవోదయా పాఠశాలలు



భారతదేశంలో 250 జిల్లాలలో నవోదయా పాఠశాలలు ప్రారంభింపబడ్డాయి. నవోదయా పాఠశాల పథకాలమీద మన ప్రభుత్వం రూ. 500 ...
2 లక్షల విజ్ఞానవంతులను ఈ పాఠశాలలు ...

## ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన కీటకాన్ని కనుగొన్నారు

యుఎస్ఎ చికాగోలో కోనార్డ్ లాబాండీరా అనే పాలియోజూవాలజిస్టు అతని సహచరులు చేరి కెనడాలో ఒక మట్టి ముద్దలో పెద్ద కళ్ళ నల్లిని కనుగొన్నారు. రెక్కలు లేని నల్లి శరీర భాగాలు 390 మిలియను సంవత్సరాలనాటి మిక్కిలి ప్రాచీనమైన కీటక జాతికి చెందినదని వారు నిర్ణయించారు.

## సామాన్య వ్యాధులలో మూడవది:

ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) వారి ప్రకటన ప్రకారం గుండె సంబంధమైన రోగాలు మరియు కాన్సర్ వ్యాధులు తరువాత మధుమేహం (డయాబిటీస్ మెలిటస్) ప్రపంచపు సామాన్య వ్యాధులలో మూడవదిగా పరిగణించబడింది. మొత్తం ప్రపంచ జనాభాలో 5 శాతం మంది ఈ వ్యాధికి గురి అవుతున్నారు.

* * *

## సీమెన్స్ లిథోస్టార్:

కిడ్నీ రోగాలు మరియు మూత్రకోశంలో రాళ్ళు సులభంగా కనిపెట్టి తగిన చికిత్స చేయడానికి ప.జర్మనీలో సీమెన్స్ AGవారు, సీమెన్స్ లిథో స్టార్ పరికరాన్ని అభివృద్ధి చేసారు. దీని అధిక శక్తివంతమైన షాక్ తరంగాలు ఇతర పరిసర టిష్యూలకు అపాయము కలిగించకుండా మూత్రపిండాలలో రాళ్ళను మాత్రమే పొడి చేసేస్తాయి.

* * *

## నడిచే చక్రాల కుర్చీ:

ఆస్ట్రియా ఫైరియల్‌లోని గ్రాజ్‌లో టెక్నికల్ యూనివర్శిటీలో శాస్త్రజ్ఞులు వికలాంగులకు అనువుగా ఉండే నడిచే చక్రాల కుర్చీని అభివృద్ధి చేసారు. కదిలే విడి భాగాలతో అమర్చబడిన ఈ కుర్చీ మేడ మెట్లు కూడా సౌలభ్యంగా ఎక్కుతుంది.

### లేకర్స్ టెస్ట్




జేమ్స్ చార్లెస్ లేకర్ ఇంగ్లండ్ దేశపు సుప్రసిద్ధ ఆఫ్ స్పిన్నర్. 1956 ఓల్డ్ ట్రాఫోర్డులో ఆస్ట్రేలియాతో జరిగిన టెస్టులో 90 19 వికెట్లు తీశాడు. క్రికెట్ టెస్ట్ ఇన్నింగ్స్‌లో 9 వికెట్లు తీసి రెండవ ఇన్నింగ్స్‌లో 10 వికెట్లు తీసుకున్న ఏకైక బౌలర్. దీనివల్లే ఆమాట లేకర్స్ టెస్ట్ అని

# జమ్మూ - కాశ్మీర్

భారతదేశానికి ఉత్తర దిక్కుగా చిట్టచివర హిమాలయాపర్వత ప్రదేశంలో ఉంది జమ్మూ-కాశ్మీర్. దీనికి ఉత్తర దిక్కున చైనా, దక్షిణ దిక్కున హిమాచలప్రదేశ్ మరియు పంజాబ్, తూర్పు దిక్కున టిబెట్, పడమట పాకిస్థాన్ ఉన్నాయి. వాయవ్య




దిక్కుగా ఆఫ్ఘనిస్థాన్, సోవియెట్ యూనియన్ ఉన్నాయి. భారతదేశంలో ఇదొక్కటే భారత రాజ్యాంగ విధానం 370 నిబంధనంలో ప్రత్యేక అనుబంధాలను అనుసరించి పాలింపబడుతూంది.

జమ్మూ - కాశ్మీర్ ఈ ప్రదేశం అంతా పర్వతమయం. కారకోరం, జాన్స్కర్, పంగి, పిర్‌పంజల్ వంటి పెద్ద పెద్ద పర్వత శ్రేణులు ఉన్నాయి. ఈ పర్వతశ్రేణులలో పెద్ద పెద్ద లోయలు ఉన్నాయి. ఇండస్, చినాబ్, జీలమ్ నదులు రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి.

ప్రాచీన కాలంనుంచీ జమ్మూ-కాశ్మీర్‌ను కాశ్మీర్ అనే పిలిచేవారు. బి.సి. 3-వ శతాబ్దంలో అశోకచక్రవర్తి పరిపాలించిన సామ్రాజ్యంలో కాశ్మీర్ ఉంది. అశోకచక్రవర్తే శ్రీనగర్ నగరాన్ని స్థాపించాడు. ఈనాడు ఇది రాజధాని ముఖ్యనగరం. కుషాను వంశస్థుడైన కనిష్కుని పరిపాలనా కాలంలో కాశ్మీర్ గొప్ప సాంస్కృతిక కేంద్రంగా ప్రసిద్ధి పొందింది. ఎ.డి. 8 వ శతాబ్దం నుంచి కాశ్మీర్‌ను అవంతివర్మన్ వంటి సుప్రసిద్ధ రాజులు పాలించారు. ఆనాడు సోమానంద, ఉత్పలదేవ, అభినవగుప్తవంటి గొప్ప గొప్ప రచయితలు, కవులు కాశ్మీరు సంస్కృతికి చేసిన సేవ చిరస్మరణీయమైంది. 11-వ శతాబ్దంలో ఇది మహమ్మదీయుల పాలనలోకి వచ్చింది.

అక్బర్ పరిపాలనాకాలంలో 1586 నుండి కాశ్మీర్ మొగలు సామ్రాజ్యంలో ఒక భాగమైంది. 1756 నుండి కొంతకాలం ఆఫ్ఘనుల పాలనలో ఉంది కాశ్మీర్ 1819 లో పంజాబ్ శిఖ్ సామ్రాజ్యానికి చేర్చబడింది. 'పంజాబ్ కేసరి' మహారాజా రంజిత్‌సింగ్ కాశ్మీర్ భాగమైన జమ్మూను 1820 లో గొలాబ్ సింగ్‌కు సంక్రమింపజేసాడు. రంజిత్‌సింగ్ మరణానంతరం, శిక్కునాయకులు (ఖల్సా శేక సేనాధిపతి) బ్రిటిష్‌వారితో పోరాటం పెట్టుకున్నారు. సొబ్‌రోన్ అనే చోట శిక్కునాయకులు బ్రిటిష్‌వారికి లొంగిపోయారు.

ంతుడు నాకన్నా వేరు కాదనే భావన వలన

కాశ్మీర్ బ్రిటిష్‌వారి వశం అయింది. బ్రిటిష్ ఆధిపత్యాన్ని గుర్తించిన జమ్ము రాజు అయిన గొలాబ్‌సింగ్ అధీనం కాశ్మీర్‌ను ఉంచారు.

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత పాకిస్థాన్ కాశ్మీర్‌పై దండెత్తింది.



సంబంధిన నియమాలకు అనుమతించి సంతకము చేసి అక్టోబరు 26, 1947 లో మహారాజా హరిసింగ్ భారతదేశంలో చేరారు.

ఇండియా - పాకిస్థాన్ పోరాటం కాల్పుల విరమణతో జనవరి 1949 న అంతమైంది. హరిసింగ్ కుమారుడైన కరణ్‌సింగ్ యువరాజు 1950లో రీజెంట్‌గా నియమింపబడ్డాడు. అక్టోబర్ 17, 1952 తో వంశ పారంపర్యంగా వచ్చే పాలక విధానం అంతరించింది. ఇతడు సాదర్-ఇ-రియాసత్ (గవర్నరు)గా ప్రమాణస్వీకారం చేసాడు.

జమ్మూ - కాశ్మీర్ పాలనా విధానం (Constitution) 1956 నవంబరు 17 న కొంతవరకు అమలులోకి వచ్చింది. జనవరి 26, 1957 న పూర్తిగా అమలులోకి వచ్చింది.

జమ్మూ - కాశ్మీరు వైశాల్యం 2,22,236 చ.కి.మీలు. దీనిలో చట్టవిరుద్ధంగా పాకిస్థాను, చైనాలు ఆక్రమించుకున్న ప్రదేశం కూడా చేరి ఉంది. దీని జనాభా 59,87,389. దీంట్లో చట్టవిరుద్ధంగా పాకిస్థాన్, చైనాలు ఆక్రమించిన ప్రదేశంలో జనాభా చేర్చలేదు. ఇచ్చట జనసాంద్రత చ.కి.మీ.కి 59 మంది. అక్షరాస్యత రేటు 26.17 శాతం. జమ్మూ-కాశ్మీరులో 14 జిల్లాలు ఉన్నాయి. లెజిస్లేటివ్ అసెంబ్లీ తోను, లెజిస్లేటివ్ కౌన్సిల్ తోను బై కేమెరల్ లెజిస్లేచర్ నిర్వహించబడుతూంది. వేసవిలో హైకోర్టు కార్యక్రమాలు శ్రీనగర్‌లోను, శీతాకాలంలో జమ్మూలోను నిర్వహించబడతాయి. డా. ఫరూక్ అబ్దుల్లా రాష్ట్రానికి ముఖ్యమంత్రి.

ఇక్కడ ఉర్దూ అధికార భాష. కాశ్మీరీ, దోగ్రి, గూజ్‌రి ఉర్దు, బాల్టి, దార్ది, పహారి, లడఖి మరియు పంజాబి మొదలైన భాషలు కూడా ప్రచారంలో ఉన్నాయి. ఇక్కడ జనాభాలో ముస్లిములు, హిందువులు, క్రిస్టియనులు, బౌద్ధులు శిక్కులు, జైనులు మొదలైన వివిధ జాతులు చేరి ఉంటారు. కాశ్మీరు జనాభాలో చాలామంది ముస్లిములు. ఈద్ ఇక్కడ వీరికి ముఖ్యమైన పండుగ. బసంత్ ఉత్సవం కూడా జరుపుకుంటారు.

కాశ్మీర్ కొయ్యపనిపి సామానులు, ఎంబ్రాయిడరీ మరియు వెండి సామానులు అతి అందంగా నాజూకుగా ఉంటాయి. ఇతర దేశాల నుంచి వచ్చే వారినందరినీ ఆకర్షిస్తాయి. కాశ్మీర్ శాలువలు ప్రపంచ ప్రసిద్ధి పొందాయి.

దేశంలో 77 శాతం జనాభా వ్యవసాయ వృత్తిమీదే ఆధారపడి ఉంది. మొత్తం

సాగులో ఉన్న భూమి 8.67 లక్షల హెక్టేరులు. వరి, గోధుమ, జొన్న ఇక్కడ ముఖ్యమైన పంటలు. బార్లీ, బాజ్రా, జోవర్ కూడా పండించబడతాయి. కొండవాలులలో ఆపిల్, పియర్స్, పీచెస్, బాద[illegible] (ఆల్మండ్స్), అక్రూట్ (వాల్‌నట్) తోటలు




విస్తారంగా ఉంటాయి. కుంకుమపువ్వు (Saffron) రాష్ట్రంలో పండింపబడే సువాసన ద్రవ్యం. చాలామంది కొండ వాలుల గడ్డి మైదానాలలో గొర్రెలు, మేకలను పెంచుకుంటూ జీవిస్తారు.

మొత్తం రాష్ట్రవైశాల్యంలో 8 వ వంతు (21,080 చ.కి.మీ.లు) అడవులతో నిండి ఉంటుంది.

1948-50 సం లో భారతదేశంలో భూ సంబంధమైన ప్రాతిపదిక సంస్కరణలు మొట్టమొదట ఇక్కడ అమలులో పెట్టబడి జాగీరులు, సామంత రాజ్యాలు రద్దుచేయబడ్డాయి

అన్ని తరగతులకు అన్ని స్థాయిలలోను రాష్ట్రంలో విద్య ఉచితంగా నేర్పబడుతూంది. స్పిన్నింగ్‌మిల్స్, సిల్కు-వీవింగ్ ఫాక్టరీ, వులెన్‌మిల్స్, రోసిన్. టర్పెంటైన్ ఉత్పాదక సంస్థలు, సిమెంట్ ఫాక్టరీ వగైరాలు ముఖ్యమైన ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలు.

కేంద్ర ప్రభుత్వ రంగంలో HMT [illegible] యన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ శ్రీనగరులో ఉన్నాయి. బ్రహ్మాండమైన 202 హెక్టేరుల బారీ బ్రాహ్మణ పారిశ్రామికవాడలో ఇతర అనేక పరిశ్రమలు జమ్మూలో ఉన్నాయి. అన్నిటి కంటే మిక్కిలి పెద్ద పారిశ్రామిక ప్రదేశం కాశ్మీర్‌వాలీలో శ్రీనగర్ దగ్గర జైన్‌కోట్‌లో ఉంది. బారాముల్లా జిల్లా సోపోర్‌లో ఫ్రూట్ ప్రోససింగ్ కాంప్లెక్స్, రెన్‌గ్రెత్‌లో ఎలక్ట్రానిక్ కాంప్లెక్స్ ఉన్నాయి. 1.90 లక్షలమంది సాంప్రదాయకమైన వివిధ చేతి పనులను చేబడతారు. కాశ్మీరు పట్టుపరిశ్రమ ప్రపంచంలో మిక్కిలి పెద్దది. ఉత్తమరకపు శిల్కు ఉత్పాదనకు కాశ్మీరు ప్రసిద్ధిపొందింది.

గాండెర్-చెనాని, కాలాకోట్, అప్పర్ సింధ్ మొదలైన పవర్ స్కీములు 1947 నుండి ప్రారంభించబడ్డాయి. లోయర్

## క్రైస్తవ మతాన్ని అనుసరించే వారు ప్రపంచంలో 162,00,00,000 ఉన్నారు

ప్రపంచంలో మొత్తం క్రైస్తవ మతాన్ని అనుసరించేవారు 162,00,00,000 మంది ఉన్నారు. వాటికాన్ (రోము) నుండి అందిన లెక్కల ప్రకారం ప్రపంచంలో 80,05,45,000 కి పైబడిన రోమన్ కాథలిక్కులు ఉన్నారు.

జీవితం అస్థిరం, ధనము, యౌవ్వనం, భార్యాపుత్రులు

జీలమ్ హైడల్ ప్రాజెక్ట్ 105 MWS విద్యుత్ శక్తిని ఉత్పాదించడం ప్రారంభించింది. కాటువా కాలువ, ప్రతాప్ కాలువ నీటి పారుదల పథకాలవల్ల 17,140 హెక్టేరులకు నీటి వసతి కలుగుతూంది. సలాల్ హైడల్ ప్రాజెక్ట్, కర్రామైక్రో - హైడల్ స్కీము, ఇతర పవర్ ప్రాజెక్టులు ఇప్పుడు ప్రారంభింపనున్నారు.


Dr Farooq Abdullah

కాశ్మీరు దేశీయ, అంతర్దేశీయ టూరిస్టులకు స్వర్గతుల్యం. ప్రతీ సంవత్సరం 7 లక్షలమంది పైగా టూరిస్టులు జమ్ము - కాశ్మీరును సందర్శిస్తారు. రాష్ట్రంలో అనేక చారిత్రక ప్రసిద్ధి పొందిన స్థలాలు, పుణ్య ప్రదేశాలు ఉన్నాయి.

వేసవి విడిదిగా ఉండే శ్రీనగరు రాష్ట్రం బిసి 3 వ శతాబ్దంలో అశోక చక్రవర్తిచే ప్రారంభింపబడింది. శ్రీనగరు నుండి న్యూఢిల్లీకి విమాన సౌకర్యం ఉంది. పఠాన్‌కోట (పంజాబ్), మరియు జమ్మూవరకు రైళ్ళు వెడతాయి. ఇక్కడనుండి యాత్రికులు శ్రీనగర్‌కు రోడ్లమీద ప్రయాణం చేసి వెళ్ళవచ్చు. సంవత్సరం పొడుగునా కారులు, బస్సులు జవహర్ టన్నెల్‌గుండా వెడతాయి.

శ్రీనగర్ సముద్రమట్టానికి 1,768 మీటర్ల ఎత్తులో ఉంది. ఈ నగరానికి ఇరు ప్రక్కల ఉన్న జీలమ్‌నదికి 9 బ్రిడ్జిలు ఉన్నాయి. జీలమ్‌నది ఒక్కటేకాక 8 కి.మీ. పొడవు, 4 కి.మీ.ల వెడల్పు గల డాల్‌లేక్ ఒడ్డున శ్రీనగర్ ఉంది

శ్రీనగరులో హౌస్‌బోట్స్ చాలా ప్రసిద్ధి పొందాయి. పడవపైన విశాలంగా అన్ని గృహవసతులతో కూడిన హౌస్‌బోట్స్‌మీద సూర్యాస్తమయం చూడడానికి మిక్కిలి ఆహ్లాదకరంగా ఉంటుంది. జీలమ్‌నదిలో, డాల్‌లేక్‌లో నీటి ప్రదేశాలలో పడవలను నడిపిస్తారు.

ప్రసిద్ధి పొందిన దేవాలయాలు, మాస్కులు ఎన్నో ఇక్కడ ఉన్నాయి. హజరత్ బాల్‌మాస్క్ కూడా ఇక్కడే ఉంది. ప్రాచీన శివాలయం 305 మీటర ఎత్తైన శంకరాచార్య పర్వతంమీద ఉంది.

నగరానికి కొద్ది కిలోమీటర్ల దూరంలో అందమైన చాష్మాషాహి. నిషాత్. షాలిమార్ వనాలు ఇక్కడ ఉన్నాయి. పిక్‌నిక్‌లకు అనువుగా ఉండే ఈ వనాలను మొగలు చక్రవర్తులు వేయించారు. శ్రీనగరుకి చేరువగా టెల్‌బాల్ (Telbal) గ్రామంలో చినార్‌వృక్షం 500 సం.ల అతిప్రాచీనమైనది.

శ్రీనగరుకి 45 కి.మీ.ల దూరంలో వులార్ లేక్‌గుండా జీలంనది పాకిస్థాన్‌లోకి ప్రవేశిస్తుంది. ఈ వులార్ లేక్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద మంచినీటి సరస్సు. దీని వెడల్పు సుమారు 15 కి మీ.లు.

శ్రీనగరుకి దగ్గరగానే 2,691 మీటర్ల ఎత్తులో గుల్‌మార్గ్ పుష్పవనం ఉంది. ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన గోల్ఫ్ మైదానం ఇక్కడే ఉంది. ఇది ఇటీవల అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణ్యంగా పీటర్ థామ్సన్ నిర్మించాడు. గుల్‌మార్గ్ నుంచి ప్రకృతి దృశ్యం అతి ఆహ్లాదకరంగా ఉంటుంది. ఇక్కడ నుంచి కాశ్మీర్‌లోయ,



హిమాలయ పర్వత శిఖరాలలో ముఖ్యమైన నంగపర్‌బత్ (8,000 మీటర్ల ఎత్తు) చూడవచ్చు.

శ్రీనగర్‌కి 90 కి.మీ.ల దూరంలో లిడ్డార్ లోయలో పహల్‌గమ్ సముద్ర మట్టానికి సుమారు 2,195 మీటర్ల ఎత్తులో ఉంటుంది. రకరకాల పువ్వులతో, చిన్న చిన్న ఏరులతో, ఎత్తైన పర్వతాలతో అతి రమణీయంగా ఉంటుంది.

పహల్‌గమ్ మార్గంలో మట్టాన్ పుణ్య స్థలంలో ప్రాచీన మార్తాండ్ సూర్య దేవాలయం ఉంది. పైన కప్పులేని ఈ దేవాలయం కాశ్మీర్‌లో మిక్కిలి పెద్దది. ఇది ప్రాచీన కాశ్మీర్ విధానంలో నిర్మించబడినా అక్కడక్కడ సాంప్రదాయకమైన గాంధార కళతో నిర్మించబడింది.

పహల్‌గమ్‌కు 45 కి.మీ. దూరంలో అమరనాథ్ సుమారు 3,800 మీటర్ల ఎత్తులో ఉంటుంది. ప్రతి సంవత్సరం జూలై, ఆగస్టు మాసాలలో పౌర్ణమినాడు యాత్రికులు పహల్‌గమ్‌నుంచి పుణ్యప్రదేశమైన అమర్‌నాథ్ గుహకు నడిచిపోతారు. ఇచ్చట పరమ శివుడు పార్వతీదేవికి ఒక పౌర్ణమిరోజున మాయ మరియు మోక్షముల రహస్యాలను వెల్లడిచేసినట్టు కథ.

శ్రీనగర్‌నుంచి 95 కి.మీ.ల దూరంలో ఉన్న సోనామార్గ్ (స్వర్ణమైదానం) ప్రకృతి రమణీయంగా ఉంటుంది. బారాహోమ్‌లో

## శ్రీకృష్ణ సంకీర్తన మహిమ

మనస్సనే అద్దాన్ని శుభ్రం చేస్తుంది.
సంసారమనే కార్చిచ్చును ఆర్పేస్తుంది.
మంగళకరమైన కలువలను వికసింపజేసే
వెన్నెలను వ్యాపింపజేస్తుంది.
విద్య అనే వధువుకు ప్రాణం పోస్తుంది.
ఆనందమనే సముద్రాన్ని వృద్ధిపరుస్తుంది.
మాటిమాటికి అమృతాన్ని ఆస్వాదింప
చేస్తుంది.
జీవాత్ములందరికీ నిర్మలత్వమనే
స్నిగ్ధతను, శాంతాన్ని కలుగజేస్తుంది.

—శ్రీ చైతన్య

భవనానికి ఆధారం పునాది. ఆధారం

నవ్యశిలాయుగానికి చెందిన (2500 బిసి) అవశేషాలను కనుగొన్నారు.

తావి (Tawi) నదికి దక్షిణ గట్టున ఉన్న జమ్ము శీతాకాలపు రాజధానినగరం. ఇదే కాశ్మీరుకి ద్వారమార్గము. ఇచ్చటి పాలరాతి రఘునాథ్ దేవాలయం మిక్కిలి అందంగా ఉంటుంది. 'డోగ్రా ఆర్ట్ గాలరీ'లో డోగ్రా



SNOW LEOPARD

ఆర్ట్‌కు సంబంధించిన వస్తువులు భద్రపరచబడ్డాయి.

శ్రీమాతా వైష్ణోదేవ్‌జీ దేవాలయం త్రికూట పర్వతప్రదేశంలో నిర్మించబడింది. ఈ ప్రదేశం జమ్మూనుంచి 48 కి మీ.లు, కాత్రానుంచి 13.5 కి.మీ.ల దూరంలో ఉంది. వైష్ణోదేవి అవతారాలైన మహాసరస్వతి, మహాకాళి, మహాలక్ష్మి విగ్రహాలు బంగారు కవచంతో ఉంటాయి. ప్రతీ సంవత్సరం వేలకు వేలు యాత్రికులు ఈ దేవాలయాన్ని దర్శిస్తారు.

శ్రీనగర్ నుండి లధక్‌కు 434 కి మీ. ల రోడ్డు ఉంటుంది. లధక్‌లో లెహ్‌నగరం 3,600 మీటర్ల ఎత్తులో ఉంటుంది. ఇక్కడ ఒక రాతి శిఖరం, రాజభవనం కూడా ఉన్నాయి.

కాశ్మీర్ జంతు సంరక్షక శాంక్చురీలలో డాచిగామ్ నేషనల్ పార్క్ ప్రపంచంలో అత్యున్నతమైనది. 141 చ.కి.మీ. ల వైశాల్యంలో 20 రకాల క్షీరదాలు సంరక్షించబడుతున్నాయి. 150 రకాల పక్షులు కూడా ఉన్నాయి. ఇచ్చట హంగుల్ (దుప్పి) మృగాలు విచ్చలవిడిగా తిరుగుతుంటాయి. లధక్‌లో ది హెమిస్ హై ఆల్టిట్యూడ్ నేషనల్‌పార్క్ 600 చ.కి.మీ.ల వైశాల్యంలో ఉంది. ఇందులో సంరక్షించబడే మృగాలు చాలా అరుదైనవి. అపురూపమైనవి. షాపు, భరాల్. గ్రేట్ టిబెటిన్ షీప్, మంచు చిరుతపులులు మొదలైనవి ఉంటాయి. సాధారణంగా క్రింది ప్రదేశాలలో కనిపించని హిమాలయన్ స్నోకాక్ కూడా ఇక్కడ ఉంది.

## ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో 50 శాతం మందికి స్వంత కార్లు ఉన్నాయి

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో 50 శాతం మందికి స్వంత కార్లు ఉన్నాయి. యునైటెడ్ స్టేట్స్‌లో ప్రతీ 1000 మందికి 557 కార్లు ఉంటే ఇక్కడ ప్రతీ 1000 మందికి 446 కార్లు ఉన్నాయి. 1987 లో ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో ప్రైవేటు కారుల సంఖ్య ఒక మిలియను పెరిగి మొత్తం కార్ల సంఖ్య 28 మిలియను అయింది.

— 'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

''ఈర్ష్య, అస

భావం తొలగిన నిష్కళంక

## ప్రపంచంలో బ్రహ్మాండమైన సెల్ఫ్ సపోర్టింగ్ టవర్

యు ఎస్ ఎస్ ఆర్ గ్రేటర్ మాస్కో ఒస్టాంకినో (Ostankino) లో 523 మీటర్ల సెల్ఫ్ సపోర్టింగ్ టవర్ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైనది. రియిన్ ఫోర్స్డ్ కాంక్రీటుతో నిర్మింపబడిన ఈ టవరు 55,000 టన్నులు తూగుతుంది. దీనిని ఎన్. వి. నికిటిన్ రూపొందించాడు.



OSTANKINO TV TOWER

దీనిని చూడడానికి వచ్చినవారు ఏదైనా ఆధారం పట్టుకుంటే గానీ ఈ టవరు పై ప్లాట్‌ఫారంమీద అడుగుపెట్టి నుంచోలేరు. ఇక్కడ గాలి బ్రహ్మాండంగా వీస్తుంది. గాలికి ఈ టవరు అత్యధికం 5 మీటర్లదాకా వంగుతుంది. వాస్తవానికి దీనిలో మూడవ వంతే లెక్కల ప్రకారం అనుమతింపబడింది.

ఈ బ్రహ్మాండమైన టవరు సూర్యకాంతికి కూడా చైతన్యవంతంగా ఉంటుంది. సూర్యకాంతికి వ్యతిరేక దిక్కులో వంగుతుంది. సూర్యకాంతి పడిన టవరు నిర్మాణం, సూర్యకాంతి పడని పీఠభాగం కంటే ఎన్నో డిగ్రీలు వేడి అధికంగా ఉంటుంది. వేడిగా ఉంది అంటే వేడివల్ల వస్తువులు వ్యాకోచం పొందుతాయి. +20° సెల్సియస్ ఉష్ణోగ్రత దగ్గర టవరు ఎత్తు 540 మీటర్ల 74 మిల్లీమీటర్లు అని నిపుణులు నిర్ణయించారు.

503 మీటర్ల ఎత్తులో మార్గం దుస్సాధ్యంగా ఉంటుంది. లోపల 70 సెంటీ

## ప్రపంచంలో మొట్టమొదటి రాజకీయ వ్యంగ్య చిత్రం

ఇటలీలో పాంపే గోడలమీద ప్రపంచంలో మొట్టమొదటి రాజకీయ వ్యంగ్య చిత్రం కనుగొనబడింది. ఈ చిత్రంలో చిలుక రూపంలో ఉన్న రోమన్ చక్రవర్తి నీరోను ఒక మిడుత తరుముతున్నట్లు వ్యంగ్యంగా సూచింపబడింది. వాస్తవంగా ఇది లోకస్థా అనే మహారాజ్యాన్ని వెనుక నుండి నడిపిస్తూంది అనే భావాన్ని వ్యంగ్యంగా ప్రదర్శిస్తూంది.

## పాల ఉత్పత్తికి భారతదేశానిది మూడవ స్థానం

సోవియెట్ యూనియన్, యునైటెడ్ స్టేట్స్ తరువాత పాల ఉత్పత్తికి భారతదేశం మూడవ స్థానాన్ని పొందుతూంది. ఈ నాడు భారతదేశంలో వరి తరువాత పాల ఉత్పత్తి ముఖ్యమైన వ్యవసాయక ఉత్పాదన. 1986-87 లో భారతదేశం 43.8 మిలియను టన్నుల పాలను ఉత్పత్తి చేసింది.

—'డెయిరీ ఇండియా 1987' సౌజన్యంతో

మీటర్ల వ్యాసం ఉన్న ఇరుకైన ప్రదేశంలో 20 మీటర్ల దూరం యాత్రికులు కుదించుకుని వెళ్ళవలసి వస్తుంది.

474 మీటర్ల ఎత్తు దగ్గర ఒక లిఫ్ట్ ఉంది. టవరుకి మొత్తం 7 లిఫ్ట్‌లు ఉన్నాయి. ఇవి సెకండుకి 7 మీటర్ల వేగంతో పోతూంటాయి.

కాంక్రీటుతో నిర్మింపబడిన మధ్య భాగం 386 మీటర్లు ఉంటుంది. దీనిపైన టెలిస్కోపు గొట్టంవంటిది ఉంటుంది. ఇక్కడే ఫ్రీక్వెన్సీ బాండ్ ఏరియల్స్ అమర్చబడ్డాయి.

381 మీటర్ల ఎత్తులో ఒక చిన్న ఇనుప తలుపు వెనుక లైట్నింగ్ డిశ్చార్జి లాబొరేటరీ ఉంది. మాస్కోలో ఈ ఎత్తైన నిర్మాణం మెరుపులను, పిడుగులను అయస్కాంతంలా ఆకర్షిస్తుంది. లాబొరేటరీలో ప్రత్యేక సాధనం పిడుగులను రికార్డు చేస్తూంటుంది.

భూమిమీద నుంచి 337 మీటర్ల ఎత్తున ఉండే 10 అంతస్థులలో చూడడానికి అనువైన ప్లాట్‌ఫారంలు, 'సెవెంత్ హెవెన్' హోటలు ఉంటాయి. గత 20 సంవత్సరాలలో 8 మిలియను మందికి పైగా యాత్రికులు దీనిని సందర్శించారు.

మీటర్ల ఎత్తులో మిక్కిలి పెద్ద ప్రీస్ట్రెస్డ్ ఫెర్రో కాంక్రీటు నిర్మాణం క్రింద సూచీ ఆకారపు టవరులోకి చొచ్చుకుంటుంది. 16 అంతస్థులలో రేడియో ప్రసార సాంకేతిక మరియు దానికి సంబంధించిన కేంద్రాలు ఉన్నాయి. పెద్ద హోటలు కిచెన్ కూడా ఇక్కడ ఉంది.

—'స్పుట్‌నిక్' సౌజన్యంతో

# గోల్ గుంబజ్-బిజపూర్‌లో బ్రహ్మాండమైన భవనం




బీజపూర్‌లో బ్రహ్మాండమైన భవనం గోల్‌గుంబజ్ మహమ్మద్ ఆదిల్‌షా రాజుచే నిర్మింపబడింది ఒక పెద్ద ఘనము (పొడవు, ఎత్తు, వెడల్పు, సమానము)పైన నిర్మింపబడిన అర్ధగోళాకారపు బురుజు (Dome) పై నాలుగు మూలల అష్టభుజాకారపు టవరు (గోపురాలు) ఉంటాయి. అర్ధగోళాకారపు బురుజు (Dome) 37 మీటర్ల వ్యాసంతో ఉంటుంది. ఇది ప్రపంచంలో రెండవ పెద్ద బురుజు. ఇటలీ రోమ్‌లో సెంట్‌పీటర్స్ టవర్ మొట్టమొదటిది. దీని కైవారం 42 మీటర్లు.

అష్టభుజాకారపు టవర్లు లేకపోతే భవనం అంతా ఒక పెద్ద హాలు దానిపై ఒక దోము. ఈ హాలు వైశాల్యం రోమ్ పాంథియన్ వైశాల్యం కంటే పెద్దదిగా ఉంటుంది.

ప్రతి మూల వంపులు తిరిగిన మెట్ల మీదుగా హాలు పై కప్పు నుండి ప్రత్యేక మార్గాల ద్వారా మధ్యలో ఉన్న విస్పరింగ్ గాలరీ దగ్గరకు వెళ్ళవచ్చు. ఇక్కడ ఎంత మెల్లిగా మాట్లాడుకున్నా ఈ ప్రక్కనుంచి ఆ ప్రక్కకు గట్టిగా వినిపిస్తుంది. గట్టిగా చేతులతో చప్పట్లు కొడితే అది విశదంగా పదిరెట్లు ప్రతిధ్వనితో వినబడుతుంది.

## అమెరికాలో మిక్కిలి భాగ్యవంతమైన కుటుంబాల సగటు ఆదాయం:

అమెరికాలో నివసించే 20 శాతం నిరు పేదల సగటు ఆదాయం 1973 నుండి 1987 సంవత్సరానికి 11 శాతం తగ్గిపోయి 20 శాతం ధనికుల సగటు ఆదాయం 24 శాతం పెరిగింది. 1979 నుండి 1987 సంవత్సరానికి పేదల సంఖ్య 21.6 మిలియను నుండి 30.4 మిలియనుకు పెరిగింది.

* * *

## రోడ్డు రవాణా పెరుగుదల:

మొత్తం సరుకుల రవాణాలో 1978-79 లో 32 శాతం ఉన్న రోడ్డు రవాణా 1986-87 కి 43 శాతానికి పెరిగింది. 1985-86 లో రోడ్లమీద 224.7 బిలియను టన్నుల సరకుల రవాణా 1988-89 లో 275.3 బిలియను టన్నులకు పెరిగింది.

* * *

## స్కూలుకి వెళ్ళని 17 శాతం పిల్లలు తక్కువ శరీర బరువుతో బాధపడుతున్నారు:

భారతదేశం పిల్లలలో 40 శాతానికి మాత్రమే అవసరమైన పోషకాంశాలతో కూడిన ఆహారం లభిస్తూంది. స్కూలుకి వెళ్ళని పిల్లలకి సరాసరి రోజుకి 350 కాలరీలు, స్కూలుకి వెళ్ళే పిల్లలకి సరాసరి 600 నుండి 800 కాలరీలు తక్కువగా లభిస్తున్నాయి. స్కూలుకి వెళ్ళని పిల్లలలో 17 శాతం బరువు తక్కువతో బాధపడుతున్నారు.

## ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైన రైలు


FRENCH TRAIN

ఈనాడు ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైన రైలు ఫ్రాన్స్‌దేశపు ఎలక్ట్రిక్ టిజివి (ట్రెయిన్ ఎ గ్రాండె విటిస్సె) లేక అధిక వేగపు ట్రెయిన్. ఇది గంటకు 170 మైళ్ళ వేగంతో పారిస్ మరియు లయన్స్ (Lyons) మధ్య ప్రయాణం చేస్తుంది. వేగంలో దీని తరువాత జపాన్‌దేశపు షింకాన్‌సెన్ లేక బుల్లెట్ ట్రెయిన్ గంటకు 138 మైళ్ళ వేగం అందుకుంటుంది.

ఆ జనుము నే విసి వేయు

## 1987-88 లో ఖాదీ ఉత్పాదన 115.72 మిలియను చ. మీటర్లు:

1987-88 లో ఖాదీ ఉత్పాదన 115.72 మిలియను చదరపు మీటర్లకు పెరగగా, విలువ రూ. 227.51 కోట్లకు పెరిగింది.

* * *

## సుగంధద్రవ్యాల ఎగుమతిలో మిరియాలు ముఖ్యస్థానం ఆక్రమిస్తున్నాయి:

భారతదేశంలో మొత్తం ప్లాంటేషన్ పంటల ఉత్పాదక విలువలో 40 శాతం సుగంధ ద్రవ్యాలు. ఈ పంటల మొత్తం ఎగుమతి విలువలో 25 శాతం సుగంధ ద్రవ్యాలది. సుగంధద్రవ్యాల ఎగుమతులలో మిరియాలు ముఖ్యస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి.

* * *

## భారతీయ రైల్వేల వాటాలో తగ్గుదల:

భారతీయ రైల్వేలకు 1978-79 లో 68 శాతం ఉన్న లాండ్ ఫ్రెయిట్ ట్రాఫిక్ 1-87 లో 56.1 శాతానికి పడిపోయింది.

## ప్రపంచ వ్యాపారంలో భారతదేశం వాటా తగ్గుదల:

ప్రపంచ వ్యాపారంలో 1957 లో 1.56 శాతం ఉన్న భారతదేశపు వాటా 1987 లో 0.54 శాతానికి తగ్గిపోయింది.

* * *

## ప్రసిద్ధ పురుషుల తండ్రులు



ABRAHAM LINCOLN

షేక్స్పియర్ తండ్రి ఒక సాధారణ ఉన్ని వర్తకుడు. డైయోక్లెటియాన్ సార్వభౌముడు ఒక బానిస కుమారుడు. అబ్రహాం లింకన్ తండ్రి వ్యవసాయం చేసుకునే నిరుపేద కూలి. కార్డినల్ అంటొనెల్లి తండ్రి ఇటలీదేశపు బందిపోటు దొంగ. మతగురువైన అడ్రియాన్ తండ్రి బిచ్చమెత్తుకు తినే సన్యాసి. పర్జిల్ తండ్రి కొన్ని ఏళ్ళ తరబడి బానిసగా ఉన్న కూలి. డెమొస్తనీస్ తండ్రి కత్తులు తయారుచేసే కంచరి. డేనియల్ వెబ్స్టర్ పేదరైతు బిడ్డ. బెన్ ఫ్రాంక్లిన్ సబ్బులు తయారీలో పనిచేసేవాడి కుమారుడు. క్రిస్టోఫర్ కొలంబస్ సాలెవాని కొడుకు.

కంచరి కొడు

## విదేశాలలోని ఇండియన్ మిషన్స్‌లో 4,670 మంది ఉద్యోగస్థులు:

విదేశాలలో గల ఇండియన్ మిషన్స్‌లో మొత్తం ఉద్యోగస్థులు 4,670 మంది. దీంట్లో భారతదేశానికి చెందిన స్థిర ఉద్యోగులు 2,756 మంది. మిగతా 1,914 ఉద్యోగులు స్థానికంగా తాత్కాలికంగా ఉద్యోగంలో నియమింపబడ్డారు.

## యునైటెడ్ స్టేట్స్‌లో ఒక కారుకి 1.8 మంది:

యునైటెడ్ స్టేట్స్‌లో ఒక కారుకి 1.8 మంది ఉంటారు. యుఎస్ఎస్ఆర్ లో 24, భారతదేశంలో 515, చైనాలో 2022 మంది ఉన్నారు. ప్రపంచ జనాభాలో 40 శాతం భారతదేశం మరియు చైనాలో ఉన్నా, ప్రపంచంలో ఉన్న కార్లలో 1 శాతంలో సగం మాత్రమే వీరికి ఉన్నాయి.

* * *

## భారతదేశంలో 15.9 లక్షల విదేశీ టూరిస్టులు:

1988 లో 15.9 లక్షల విదేశీ టూరిస్టులు భారతదేశాన్ని సందర్శించారు.

* * *

## పబ్లిక్ సెక్టార్ బాంకులలో డిపాజిట్లు పెరుగుదల:

1986 లో పబ్లిక్ సెక్టారు బాంకులలో ఉన్న మొత్తం రూ. 92,481.38 కోట్ల డిపాజిట్లు జనవరి 1989కి రూ. 1,23,748. కోట్లకు పెరిగాయి.

* * *

## 14.74 లక్షల దరఖాస్తులు పెండింగు:

క్రొత్త టెలిఫోను కనెక్షనులకు జనవరి 1, 1989 నాటికి పెండింగ్‌లో ఉన్న మొత్తం 14.74 లక్షల దరఖాస్తులలో 13.5 లక్షల దరఖాస్తులు పట్టణప్రదేశాలకు చెందినవి.

## సోవియెట్ మహిళలు



సోవియట్ యూనియన్‌లో ఇంజనీర్లలో 33 శాతం, టెక్నాలజిస్టులలో 38 శాతం, పరిశోధకులలో 40 శాతం అంతా మహిళలే. విజ్ఞాన శాస్త్రజ్ఞులలో 28 శాతం, డాక్టర్లలో 14 శాతం, ప్రొఫెసర్లు; కంపెనీ మేనేజర్లలో 11 శాతం మహిళలు.

—'స్పుట్నిక్' సౌజన్యంతో

"జ్ఞానం కంటె వివేచన శక్తి ఉత్తమం."

వి. ఎస్. శ్రీనివాసన్

తమిళనాడులో కేరళ మధురై సరిహద్దులో తిరునల్వేలి జిల్లాలో ప. కనుమలలో ఉన్న పళని పర్వత శ్రేణిలో ఉంది కుర్రాలం జలపాతం. దక్షిణ రైల్వేమార్గంలో తెంగాశి నుంచి 6 కి.మీ.ల దూరంలోను, తిరునల్వేలి



నుంచి 64 కి.మీ. ల దూరంలోను ఉంది. కుర్రాలం అందమైన జలపాతంతో సుందరమైన అటవీ దృశ్యంతో, సుప్రసిద్ధమైన దేవాలయంతో అలరారుతూంటుంది. ఇక్కడ కొన్ని మాసాలపాటు వాతావరణం అతి చల్లగా అత్యంత ఆహ్లాదకరంగా ఉంటుంది.

సాధారణంగా జూన్ మాసంలో నైఋతి ఋతుపవనాలతో ప్రారంభమై సెప్టెంబరు అక్టోబరు ఆఖరువరకు వాతావరణం మిక్కిలి అనుకూలవంతంగా ఉంటుంది. సంవత్సరంలో సరాసరి వర్షపాతం అంత అధికంగా ఉండదు. సెలవులలో విశ్రాంతి తీసుకునే వారికి, ఆరోగ్యాన్ని చేకూర్చుకునేవారికి ఇచ్చటి వాతావరణం మిక్కిలి అనుకూలంగా ఉంటుంది. కొండలు, లోయలు, జలపాతాలతోను, సెలయేళ్ళతోను ఎక్కడ చూసినా చిన్న చిన్న వాగులతోను, ప్రవాహాలతోను ప్రకృతి ఇతోధిక రమణీయంగా ప్రకాశిస్తూ పిక్‌నిక్‌లకు, విలాసయాత్రలకు అనుకూలవంతంగా ఉంటుంది.

బిషప్ కాల్డ్‌వెల్ ప్రపంచంలో మిక్కిలి సుందరమైన మంచినీటి స్నానాల ప్రదేశం అని పొగడిన ముఖ్య జలపాతమే కాకుండా

## సుభాషితాలు

మూల మెవ్వరనుచు ముగ్గురిలో గల
మూల మెరుగలేరు మూఢ జనులు
మూలమంతటికిని ముఖ్యము కర్మము
విశ్వదాభిరామ వినురవేమా!

[బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఎవరు ముఖ్యమని వాదులాడుకుంటారు. అంతటికీ మూలం కర్మ. త్రిమూర్తులు కూడా దానికి లొంగారు.]

* * *

మాటలుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్రముడుగకున్న మది కుదురదు
మనసు కుదురకున్న మరి ముక్తిలేదయా
విశ్వదాభిరామ వినురవేమా!

[మౌనం వహిస్తే మంత్రం ఫలిస్తుంది. మంత్రం ఫలిస్తేనే మనస్సు నిలకడగా ఉంటుంది. మనస్సు నిలకడగా ఉంచేనే ముక్తి లభిస్తుంది.]

''ఏం చేయాలో'' పటిమ చెబుతుంది,

అడవులలోపల పంచజలపాతం, చిత్తరువి, బ్రహ్మాండమైన మధుపాతం (Honey Falls) లేక తేనరువి, షెన్బగదేవి జలపాతం చాలా ముఖ్యమైనవి. పంచ జలపాతము మరియు చిత్తరువి కొంతమందే దర్శిస్తారు.

కుట్రాలం కొండప్రదేశాలలో సువాసన ద్రవ్యాలు విస్తారంగా పండుతాయి. పనస చాలా విరివిగా ఉంటుంది. మంచి తేనె లభిస్తుంది. ఇక్కడ మోడల్ ఆర్చర్డ్ సెంటర్



ఉంది. జలపాతానికి చేరువగా అందమైన కుట్రాలనాథర్ దేవాలయం చూడదగినది. 'చిత్రసభ' అని చెప్పబడే దేవాలయం కూడా ప్రసిద్ధికి వస్తుంది. 8 వ శతాబ్దంలో తిరుజ్ఞాన సంబంధర్ అనే భక్తుడు కుట్రాలనాథర్‌ను గురించి, దేవేరి కుళల్ వాయ్‌మొళి అమ్మై గురించి, జలపాతం గురించి అనేక పాటలు రచించాడు. పురాణం ప్రకారం పరమశివుడు నటరాజా తమిళనాడులో అయిదు ప్రదేశాలలో తాండవం చేశాడని ప్రతీతి. ఆ అయిదు పుణ్య ప్రదేశాలలో కుట్రాలం ఒకటి. దీన్నే 'చిత్రసభ' అని కూడా పిలుస్తారు. కుట్రాలం దగ్గర మిక్కిలి ఆకర్షణీయమైనది 'పెద అరువి'. సుమారు 300 అడుగుల ఎత్తునుండి మూడు మెట్లుగా జారి ప్రవహిస్తున్న చిత్రారు నది ఎంతో



## ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైన మెయిన్‌ఫ్రేమ్ కంప్యూటర్

జపానులో కంప్యూటర్లను తయారుచేసే మిక్కిలి పెద్ద కంపెనీ ఫ్యూజిట్సు లిమిటెడ్ వారు ప్రపంచంలో అత్యధిక వేగవంతమైన మెయిన్‌ఫ్రేమ్ కంప్యూటర్‌ను తయారు చేశారు. ఈ కంప్యూటర్ ఐబిఎమ్ వారి అదు [illegible] '3090 కంప్యూటర్' కంటే [illegible] సమాచారాన్ని [illegible] చేస్తుంది.

"పని చేయక తప్పదు. [illegible]

గంభీరంగా ఉంటుంది. జూన్, సెప్టెంబర్ మాసాలలోను, ఈశాన్య ఋతుపవనాలు వీచే నవంబరు నుండి జనవరి మాసాలలోను జల పాతం జల జలమని నిండుగా పారుతూం టుంది.



ఎత్తైన కొండలమీద అడవులగుండా ప్రవ హించే చిత్రార్ నది జలపాతంలోకి ప్రవ హిస్తూంటుంది. సగం దూరం ప్రవహించిన తరువాత కొండమీద సన్నకాలువగా ఏర్పడు తుంది. దీనినే ఇక్కడ 'పొంగుమామ్ కడల్' అంటారు. ఇక్కడే ఇది విడిపోతుంది.

కొండ అడుగు భాగంలోగల పల్లంలో నుంచి వచ్చే జలపాతంలో అందరూ స్నానాలు చేస్తారు కొండ పై భాగం రాయి విడిగా కొంత విడిపోయి జలపాతం ప్రవహి స్తుంది. ఇది సుమారు 13-14 అడుగుల ఎత్తున ఉంటుంది ఒక్కసారి పీఠ్యంటిమీద పడీపడటంతోటే ఎంతో హాయి అనిపిస్తుంది. ఇక్కడ స్నానం చేస్తే ఉత్తేజకరంగా ఉంటుంది. కొండమీద ఆరోగ్యాభివృద్ధికర మైన, అమూల్యమైన మూలికలు ఖనిజాలు గుండా నీరు ప్రవహిస్తుంది కాబట్టి ఆ నీటిలో స్నానం చేయడంవల్ల శరీరానికి ఒక విధ మైన తేజస్సు కాంతి ఏర్పడుతుంది, రోగాలు నిర్మూలిస్తాయి ఒకేసారి 200 మంది అనుకూలంగా అపాయం లేకుండా స్నానాలు చేయడానికి ఇనుపకమ్ములు ఏర్పాటు చేయ బడ్డాయి.

## కొన్ని గ్రంథాలు - వాటి రచయితలు

| బాగా అమ్ముడైన పుస్తకాలు | వ్రాసినవారు |
|---|---|
| పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్ | జాన్ బున్‌యాన్ |
| డాన్ క్విక్సోట్ | సెర్వాంటెస్ |
| హిమ్ టు ది పిల్గరీ | డేనియల్ డీఫో |
| ఫీస్ట్ ఆఫ్ ది పొయెట్స్ | లెయ్ హంట్ |
| నావెల్స్ అబౌట్ ది అమెరికన్ వెస్ట్ | కార్ల్ మే |
| గ్లిమ్‌సెస్ ఆఫ్ ది వరల్డ్ హిస్టరీ | జవహర్‌లాల్ నెహ్రూ |
| ది జెంటిల్ గ్రాఫ్టర్ | ఓ. హెన్రీ |
| గ్రాండ్ టెస్టమెంట్ | ఫ్రాన్ కోయిస్ విల్లన్ |
| డి ప్రొఫండిస్ | ఆస్కార్ వైల్డ్ |

"పదండి ముందుకు, పదండి పోదాం,

# "జిన్‌సెంగ్" - జీవమూలిక

జిన్‌సెంగ్ ఒక అద్భుతమైన మొక్క. దీనినే ఇంగ్లీషులో 'ది రూట్ ఆఫ్ లైఫ్' (జీవమూలిక) అంటారు. రోగంవల్ల శక్తి పోయినవారికి తిరిగి శక్తిని కలిగిస్తుందని, ఉత్తేజవంతమైన ఆరోగ్యాభివృద్ధిని కలిగిస్తుందని, వృద్ధుల ఆయువును అధికం చేస్తుందని దీని రహస్యం టిబెట్‌లో 5000 సంవత్సరాలకు పూర్వమే ఆనాటి వైద్యులకు తెలుసు.




జిన్‌సెంగ్ విలువ ఆనాడు ఈనాడు కూడా బంగారంతో సమానంగా ఉంది. ఈ వేరు మెల్లిగా ఒక సంవత్సరానికి కొన్ని గ్రాములు పెరిగి లావెక్కుతుంది. సాధారణంగా మొక్క పాతిన తరువాత 7 లేక 8 ఏళ్ళకు దీనిని త్రవ్వవచ్చు. అయినా 10, 15 ఏళ్ళపాటు పెరగనివ్వడం ఉత్తమం. బాగా ఉత్తేజకరంగా ఉంటుంది. బాగా లావుగా పెరిగినకొద్దీ దాని శక్తి అధికం అవుతుంది. ఎక్కువ అమోఘంగా పనిచేస్తుంది. రోగ నిరోధక గుణాలు అధికంగా వృద్ధిపొందుతాయి.

ఈ వేరు రసానికి అమూల్యమైన ఉత్తమ ఔషధ గుణాలు ఉన్నాయని ఆధునిక పరిశోధనవల్ల తెలిసింది. మానవుని మానసిక, శారీరక శక్తులను బ్రహ్మాండంగా వృద్ధిచేసి సమర్ధతను పెంచుతుంది. మానసిక, శారీరక ఒత్తిడిని తగ్గిస్తుంది. నీరసపడిపోయిన వంట్లో సత్తువ తగ్గిపోయినప్పుడు దీనిని వాడడంవల్ల ఉత్తేజకరంగా బలవర్ధకంగా ఉంటుంది. రక్తాభివృద్ధిని కలిగించి శరీరంలో రోగనిరోధక శక్తిని అధికపరుస్తుంది. ఎక్కువ ఉత్తేజకరమైనది కాబట్టి కొందరికి వికటిస్తుంది కూడా.

సోవియెట్ ఫార్ ఈస్టు, సైబీరియా, కాకెసియన్ పర్వతప్రదేశాలలోను, యుక్రైన్‌లో ప్రత్యేకంగా ప్లాంటేషన్ తోటలలో ప్రయోగాత్మకంగా దీనిని పండిస్తున్నారు.

(మిగతా 43 వ పేజీలో)

## కొత్త మందు!

సంతోషకరమైన వార్త! ప్రపంచంలో పిన్నలు, పెద్దలు, వృద్ధులు, స్త్రీ పురుషులు, అందరికీ ఒకే మందు. వేరే వైద్య సహకారం అక్కరలేదు. మోతాదు నియమం లేదు. కాలనియమంలేదు. వాడిన కొద్దీ ఇతోధిక ఆయురారోగ్య సౌభాగ్యాలు నిరంతరం అనుభవిస్తారు. ఈరోజే ఇప్పుడే ప్రారంభించండి. ఆలస్యం అమృతం విషం. నవ్వు అనే మాత్రను, హాస్యం అనే తేనెలో రంగరించి, 'సంతోషం' అనే అనుపానంతో సేవించండి.

— లాలస

ఆయుస్సును గురించి వేద

యూ దేవతలను ఆరాధిస్తారు. ధనుర్మా
సంలో ఇళ్ళకు వెల్లలు కొట్టించి ముగ్గులతో
అలంకరిస్తారు. ఇళ్ళముందు ప్రతిరోజూ
పిండిలతో పెద్ద పెద్ద ముగ్గులు పెడతారు.
సంక్రాంతి రథం ముగ్గు ప్రత్యేకమైనది.
రథసప్తమికి సూర్యుని రథం ముగ్గుగా తీర్చి
సూర్యుణ్ని ఆరాధిస్తారు. కృష్ణాష్టమికి నడిచి



వచ్చే కృష్ణుని పాదాల ముగ్గులు ఎంతో రమ
ణీయంగా ఉంటాయి. ఈ విధంగా సంద
ర్భానుసారంగా భావగర్భితంగా ఇళ్ళను
ముగ్గులతో అలంకరిస్తారు.

చిత్రావలిరచనాపద్ధతి ప్రధాన లక్షణం
అలంకారం. రానురాను వస్తువునుండి
రూపము, చిత్రలేఖనము విడిపోయి స్వాతం
త్ర్యాన్ని, వ్యక్తిత్వాన్ని గడించుకున్నాయి.

ఈ విధంగా ఆవిర్భవించిన చిత్రలేఖనం
నుంచి ముగ్గులు వేయడం స్త్రీలు అభ్యసించి
ప్రవృద్ధి చేసిన ఒక జానపదకళ. ఇది సనా
తనం కాదు. అర్వాచీనం కాదు. ప్రాచీన
కాలగర్భంలో వేరుదన్ని ఎదతెగక నవనవో
న్మేషంగా క్రొత్త కొమ్మలతో, చిగుళ్ళతో,
పూవులతో విలసిల్లే మహావృక్షం. వీటికి
సహజమైన శైలి ఒక లక్షణం. ఇదే జాన
పద శైలి. ఇది స్వచ్ఛందము, సరసము,
సాధారణము. అప్రయత్న పూర్వకంగా
సుకుమార భావాలతో ప్రవృద్ధి పొందుతూం
టుంది. వస్తువు జన సామాన్యమైన పరిచిత
వస్తువుగా నిసర్గమనోహరంగా ఉంటుంది.

ఈ జానపద కళలో ఉండే విశిష్టత,
అందము అనుభవించుచే సరసులు, సహృద
యులు చేయతగిన పని. ఇది ఒక సమిష్టి
సృష్టి. దీనికి ప్రత్యేక చిత్రకారుడు లేడు.
ఇవన్నీ అనాదిగా సాంప్రదాయకంగా, అను
స్మృతంగా వస్తున్నవే. వంశ పారంపర్యంగా
ఒకరి దగ్గరి నుంచి ఒకరు అమ్మమ్మల
దగ్గరో, మామ్మల దగ్గరో నేర్చుకున్నవి



ఆర్టు స్కూలులో డ్రాయింగ్ మాష్టరు దగ్గర
నేర్చుకున్నవి కావు. ఎల్లోరా నాగార్జున
కొండలలో ఉత్తమ శిల్పులు చెక్కిన అపు
రూప కళాఖండాల నుంచి, సుప్రసిద్ధ చిత్ర
కారుల అజంతా లేపాక్షి చిత్రాలనుంచి
స్ఫూర్తిని కలిగించుకుని భారతనారి ముగ్గులలో
చిత్రకళా నైపుణ్యాన్ని ప్రతిబింబింపజేస్తుంది.

నీవు అభ్యసించేదే ఆదేశించు, మాటలతో కాదు

ప్రతి హిందూగృహము ఒక చిత్రశాలే, ప్రతి గృహిణి ఒక ఉత్తమ చిత్రకారిణే.

పూజా సమయాలలో అష్ట దళ పద్మము. సర్వతో భద్రము, గదులపెట్టె మొదలైన ముగ్గులు పెడతారు. ధనుర్మాసంలోను, నాగులచవితి, నాగపంచమి, షష్ఠి మొదలైన పండుగలకు పాముల ముగ్గులు పెడుతుంటారు.



ప్రతిరోజూ కొంతమంది ఇళ్ళలో నిత్య నవగ్రహపూజ చేసుకుంటారు. శైవులు, వైష్ణవులు కూడా దీనిని అనుసరిస్తారు. దీనికి ప్రత్యేకంగా వారివారి సాంప్రదాయాన్ని బట్టి, ఆచారాన్ని బట్టి రోజుకు ఒకరకం ముగు పెట్టి, దీపం పెట్టి పూజచేసుకుంటారు.

ముగ్గులు తీర్చడానికి రకరకాల సాధనాలు ఉన్నా చేతితో ముగ్గుపెట్టడం గృహిణి హస్త కళా నైపుణ్యాన్ని తెలియజేస్తుంది. నిత్య జీవితంలో ఒక ముఖ్యాంశంగా ప్రవృద్ధి పొందిన ఈ కళ ఈనాడు మరుగైపోతూంది. చాలా అరుదుగా కనిపిస్తూంది. పెద్దపెద్ద పట్టణాలలోను, నగరాలలోను ఇది మరింత దీనావస్థలో ఉంది. ఈనాడు గృహిణికి ముగ్గుపిండి (వరిపిండి), గుల్లముగ్గు, రాతి ముగ్గుని చేతితో ముట్టుకోడం అనాగరికం అనిపిస్తూంది. అందుకే ముగ్గుకు బదులుగా గుమ్మం ముందు తడిగుడ్డతో తుడిచి ఒక సుద్దముక్కతో రెండు వంకరటింకర గీతలు గీసేస్తుంది. ముఖ్యంగా ఫ్లాటులలో నివసించే వారు ఎవరికి వారే తమకెందుకని ఎవ్వరూ ముగ్గుపెట్టరు. ముగ్గు పెట్టడానికి చోటు ఉండదు. దీనికి సాయం ఇంట్లో అంతా మొజాయిక్. ముగ్గు వేసినా కనిపించదు. రెడీమేడు ప్లాస్టిక్ షీటు ముగ్గులు సులభంగా మార్కెట్‌లో లభిస్తున్నాయి. వాటిని ఇళ్ళలో అతికించేసుకుని పర్మనెంటు ముగ్గు అనే భ్రాంతితో సంతోషిస్తున్నారు.

దేశాభ్యుదయానికి. దేశ కళ్యాణానికి పచ్చ తోరణం వంటి ఈ జానపద కళ ముగ్గులు మరుగున పడిపోకుండా పునరుద్ధరించాలి. ప్రతి ఇంట్లోను ప్రతి గృహిణి సృజనాత్మకంగా. కాలానుగుణ్యంగా ఈ కళను ప్రవృద్ధి చేయవలసిన అవసరం ఉంది.

—కాదూరి

(39వ పేజీ తరువాయి)

వేళ్ళు ఎండబెట్టి బాగా నూరి చూర్ణం తయారుచేస్తారు. ఈ చూర్ణంనుంచి కషాయం తయారుచేసి దానినుంచి అమోఘమైన పదార్థాలు తయారుచేస్తారు. వీటిని అనేక ఔషధాలలో ఉపయోగిస్తారు. సౌందర్య వర్ధకాలలో కూడా వీటిని ఉపయోగిస్తారు. వీటిని అంతరిక్ష ప్రయోగాలలో గ్లాసు జాడీలలో పెంచవచ్చు. భూమిలో కంటే అంతరిక్ష ప్రయోగాలలో ఈ మొక్క చాలా త్వరగా పెరుగుతుంది. ఇది మానవులు అంతరిక్షంలో దీర్ఘకాలం ఉండవలసినప్పుడు మంచి ఉత్తేజకరమైన మందుగా ఉపయోగపడుతుంది.

—'స్పుట్‌నిక్' సౌజన్యంతో

థంలో ముదురు చూస్తూంటే, ద్వేషం

**అతిశక్తివంతమైన ప్రబలవాయువు:**

ఇంతవరకు ఎప్పుడూ కని విని ఎరుగని మిక్కిలి శక్తివంతమైన ప్రబలవాయువు



ఏప్రిల్ 12, 1934 న రికార్డు అయింది. గంటకు 370 కి.మీ. వేగంతో వీచింది.

* * *

**దీర్ఘకాలం పాలించిన బ్రిటన్ సామ్రాజ్యాధిపతి:**

దీర్ఘకాలం పాలించిన బ్రిటన్ సామ్రాజ్యాధిపతి విక్టోరియా మహారాణి జనవరి 1, 1887 న హిందూదేశానికి సామ్రాజ్యాధిపతి రాణిగా ప్రకటింపబడింది.

* * *

**పగలు, రాత్రి సమానం:**

మార్చి 23 వ తేదీన పగలు, రాత్రి సమానంగా ఉంటాయి. దీనినే వెర్నల్ ఈక్వినాక్స్ (విషువత్తు) అంటారు.

**ఫ్రెంచి జాతీయగీతం 1792 లో రచింపబడింది:**

లామార్సెల్లైసే (La Marseillaise) ఫ్రెంచి దేశపు విప్లవ గీతం. అది ఈనాడు ఫ్రెంచి నేషనల్ ఆంథెమ్. దీనిని 1792 లో రాగెట్ ది లిస్లె రచించాడు.

* * *

## ప్రపంచ రికార్డు పొందిన డీసెల్ ట్రెయిన్ వేగం

లండన్, బ్రిస్టల్ మరియు సౌత్ వేల్సుల మధ్య అతి వేగమైన రైలు సర్వీసును ప్రవేశపెట్టడానికి 1976 లో మొట్టమొదట బ్రిటిష్ రైలువారు అధికవేగపు డీసెల్ ట్రెయినులను ఉపయోగించారు. 1986 లో ప్రయోగ ప్రదర్శనలో డీసెల్ రైలు గంటకు ... కి.మీ. వేగం అందుకుంది.

## జెయ్‌పూర్‌లో హవామహల్ ముఖ్యమైనది

రాజస్థాన్ జెయ్‌పూర్‌లో బ్రహ్మాండమైన నిర్మాణం హవామహల్, నగరం మధ్య భాగంలో ఉంది. 1799 లో మహారాజా సవాయ్ ప్రతాప్‌సింగ్ కట్టించిన ఈ గొప్ప భవనానికి పెద్దపెద్ద కిటికీలు, వృత్తాకారపు పైకప్పులు, అందమైన బురుజులు ఉన్నాయి. ఇవి మిక్కిలి నాజూకుగా అందంగా నిర్మించబడ్డాయి.

"తల్లిని పూజింపని దైవభక్తుడు అసత్యవాది."

**అల్లాపెర్ల్ 1934 లో కనుగొనబడింది:**

6.3 కి.గ్రా.లు తూగే అల్లాపెర్ల్ అనబడే సుప్రసిద్ధ ముత్యం మే 7, 1934 న ఒక రాకాసి రకపు షెల్ చేప పైగుల్లభాగంలో కనుగొనబడింది.

* * *

**గ్రద్దలు పెద్ద పెద్ద గూళ్ళు కడతాయి:**

పక్షులలో గ్రద్దలు పెద్ద పెద్ద గూళ్ళు నిర్మించుకుంటాయి.

* * *

**ప. జర్మనీ 1949 లో ఏర్పడింది:**

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ (ప.జర్మనీ) సెప్టెంబరు 21, 1949 న ఏర్పడింది.

* * *

**మొట్టమొదటి ఇంగ్లీషుబైబిల్:**

1535 వ సం.లో మొట్టమొదటి ఇంగ్లీషు బైబిల్ ప్రచురింపబడింది.

* * *

**సుప్రసిద్ధ గెట్టిస్‌బర్గ్ ప్రసంగం:**

ప్రెసిడెంట్ అబ్రహాంలింకన్ నవంబరు 19, 1863 న తన సుప్రసిద్ధ గెట్టిస్‌బర్గ్ ప్రసంగాన్ని ప్రజలచే, ప్రజలకొరకైన ప్రజాప్రభుత్వం భూమిపై ఎన్నటికీ నశించదు అని ముగించాడు.

## ప్రపంచపు మంచులో 90 శాతం అంటార్కిటికాలో ఉంది



దక్షిణ ధృవం చుట్టూ అంటార్కిటిక్ ఖండం మంచు ప్రదేశం 4,300 మీటర్ల దళసరి ఐస్ పేరుకుపోయి ఉంటుంది. ప్రపంచపు మంచినీటిలో 90 శాతం ఈ మంచు ఖండంలో ఐసుగా మారి ఉంది.

ప్రపంచంలో అతితక్కువ ఉష్ణోగ్రతను ఇక్కడ పరిశోధకులు రికార్డు చేశారు. 1960 లో సోవియెట్ శాస్త్రజ్ఞులు అంటార్కిటికాలో ప్రయోగాలు చేస్తూ లోబ్లడ్‌ప్రెషర్, తలనొప్పితో బాధపడ్డారు. మంచి ఆహారాన్ని, మిక్కిలి ఆధునికమైన సాధన సదుపాయాలను తీసుకువెళ్ళినా ఊపిరి తీసుకోవడమే బ్రహ్మాండమయిపోయింది. తరచుగా అంటార్కిటికాకు వెళ్ళిన పరిశోధకులు, శాస్త్రజ్ఞులు నీరసపడిపోయి ఆకలితో మరణిస్తారు.

అంటార్కిటికాలో వరుసగా ఆరునెలలపాటు చిమ్మచీకటి, ఆరునెలలపాటు వెలుతురు ఉంటుంది. పెట్రోలియం, రాగి, కోబాల్ట్, యురేనియం, ప్లాటినం వెండి, బంగారం, వజ్రాలు అంటార్కిటికా మంచుగడ్డ క్రింద సుప్తంగా ఉంటాయి. అభివృద్ధి చెందిన సాంకేతిక నైపుణ్యంతో త్రవ్వి వెలికితీయాలి.

బడలిన శరీరానికి నిద్ర ఎంత అవసరమో,

# మార్తాండ్ - కాశ్మీర్ కోణార్క్

రాఘవేంద్రరావు

ఒరిస్సాను పరిపాలించిన గంగ వంశపు రాజులలో ఒకటవ మహారాజా నరసింగ దేవ 13 వ శతాబ్దంలో కోణార్క్ దేవాలయం నిర్మించాడు. కాశ్మీర్ శ్రీనగర్ లో మార్తాండ్ సూర్యదేవాలయం అప్పటికి సుమారు 500 సంవత్సరాలకు పూర్వం నిర్మించబడింది.



RUINS OF THE SUN TEMPLE

కాశ్మీర్ లోయలో ఇస్లామ్ మతం స్థాపింపబడడానికి ముందే అశోక చక్రవర్తి ఇచ్చట బౌద్ధమతాన్ని నెలకొల్పాడు. తరువాత 1 వ A.D. శతాబ్దంలో బౌద్ధమతావలంబికుడైన కనిష్క చక్రవర్తి ఈ సువిశాల సామ్రాజ్యంలో బౌద్ధ ధర్మాన్ని ప్రచారం చేసాడు.

కాలక్రమేణా ఇక్కడ బౌద్ధమతం క్షీణించి హిందూమతం వేరుతన్ని పాతుకు పోయింది 1346 వరకు కాశ్మీర్‌ను అనేక హైందవ వంశాలు పరిపాలించినట్లు చరిత్ర వల్ల తెలుస్తూంది. తరువాత ఇచ్చట మహమ్మదీయ పాలన ప్రారంభమైంది.

కాశ్మీర్‌లో అవంతిపూర్, పట్టాన్, పాండ్రెన్‌థాన్, మార్తాండ్ హైందవ మతానికి, సంస్కృతికి కొన్ని ముఖ్య కేంద్రాలుగా ఏర్పడ్డాయి.

శ్రీనగర్‌కి 68 కి.మీ. దూరంలో ఉన్న మార్తాండ్ అనేక నదులతో, కాలువలతో, మంచినీటి బుగ్గలతో ఆవరించబడి ఉంది. కాశ్మీర్‌ను పాలించిన గొప్పవీరుడు, యోధుడు లలితాదిత్య ముక్తపిడ (699-736 A.D.)

## తేనె అనేక రకాల వ్రణాలను మాన్పుతుంది

అమోఘమైన ఔషధ గుణాలు కలిగిన తేనె కాల్పులు, బొబ్బలు, కురుపులు మరియు అనేక రకాల వ్రణాలను మాన్పుతూంది. పశ్చిమ ఆఫ్రికా నైజీరియా కాలబార్‌లో యూనివర్శిటీ టీచింగ్ హాస్పిటల్లో కన్సల్టెంట్ సర్జన్ మరియు లెక్చరర్ అయిన డా. స్పెన్సర్ ఎఫెమ్ రోగుల వ్రణాలకు శుద్ధి చేయని తేనెపట్టించి అతి శీఘ్రంగా నివారణ కలిగించాడు.

## రోజుకి 370 మైళ్లు చొప్పున 10 సంవత్సరాలు ప్రయాణం

స్కూలులో పాఠాలు నేర్పడానికి బ్రూనో లూథార్డ్ట్ రోజుకి 370 మైళ్ళు చొప్పున 10 సంవత్సరాలు (1957-67) హాంబర్గ్ నుండి డార్ట్‌మండ్‌కు వెళ్ళాడు. ఇతడు ఒకే ఒకసారి ఆలస్యంగా వచ్చాడు.

ప్రసిద్ధిపొందిన మార్తాండ సూర్యదేవాలయాన్ని నిర్మించాడు. సుప్రసిద్ధ బ్రిటిష్ చరిత్రకారుడు, పరిశోధకుడు అయిన సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్బెండ్ ఈ దేవాలయాన్ని గురించి వివరిస్తూ 'శిథిలావస్థలో ఉన్న ఈ దేవాలయం బ్రహ్మాండంగా విస్తరించుకున్న నిర్మాణం శిల్పనైపుణ్యంతోను, వివిధ అలంకారాలతోను ఎంతో అద్భుతంగా ఉంది' అని వ్రాసాడు.

మిక్కిలి బ్రహ్మాండమైన ఈ సూర్యదేవాలయం పెద్దపెద్ద స్తంభాలమీద దీర్ఘ చతురస్రాకారపు ఆవరణలో నిర్మించబడింది. ముందు మిక్కిలి ఎత్తుగా ఉండే గోడలతో చావడి గుండా లోపలికి ప్రవేశించాలి. ఈ గోడలకు నగిషీలతో వంపులు తీర్చిన ద్వారాలు ఉంటాయి.

67 మీటర్ల పొడవు, 43 మీటర్ల వెడల్పు గల విశాలమైన ద్వార మంటపాలు మిక్కిలి దీనావస్థలో ఉన్నాయి. ద్వారమండపంలో విడిగా ఒక పూజా మందిరం ఉంది. ఈ మైదానంలో శిథిలమైన 84 స్తంభాలు ఉన్నాయి. ఇది వారంలోగల రోజులు మరియు రాశి చక్రంలోగల 12 రాశుల గుణిజమును సూచిస్తుంది.

ఈ ప్రాచీన మార్తాండ తీర్థమే కాశ్యప మహాముని నివాసం అంటారు. మార్తాండ్‌లో మంచినీటి ఊట బుగ్గలు సాక్షాత్తు పరమశివుడు ఏర్పరచినట్లు పురాణాలు తెలుపుతున్నాయి. ఒకప్పుడు పవిత్రమైన పుణ్యతీర్థంగా వెలసిన మార్తాండ్‌ను నేడు ఏ కొద్దిమందో తప్ప విలాసయాత్రికులు ఎవరూ దర్శించడం లేదు.

## సబ్‌మెరైన్‌మీద ప్రయాణించే ఉత్తరధృవం దాటారు



1958 లో అణుశక్తితో ప్రయాణం చేయునైటెడ్ స్టేట్స్ సబ్‌మెరైన్ నాటిల (Nautilus) సహాయంతో మొట్టమొదట ఉత్తర ధృవం దాటబడింది. ఉత్తర ధృవం దగ్గర సుమారు 8,000 కి.మీటర్లు ఆర్కిటిక్ మంచుగడ్డ క్రింద ప్రయాణం చేసింది.

ఎకో సౌండర్స్ మరియు ఇతర సాధనాల సహాయంతో సబ్‌మెరైన్ నడిపేవారు సముద్రగర్భం నుంచి దూరం, మంచుగడ్డ దళసరి మొదలైన వివరాలు తెలుసుకున్నారు. అయినా కమాండర్ విలియం ఆర్. ఆండెర్సన్ మరియు ఇతర పరిశోధకులు అపాయ పరిస్థితులలో చిక్కుకున్నారు. క్రమంగా రోజులు గడచిన కొద్దీ వీరు ఉత్తర ధృ మీదుగా పసిఫిక్ మహాసముద్రం బేరింగ్ జలసంధి అక్కడ నుంచి టిక్ మహాసముద్రం వద్దకు చేరారు.

### ాగా నిద్ర పట్టాలంటే?

రాత్రిళ్ళు బాగా నిద్ర పడుతూందా? లేక ోతే పడుకునేటప్పుడు ఒక కప్పు వెచ్చని ాలలో కొంచెం తేనె కలిపి త్రాగండి. బ్రహ్మాండంగా నిద్ర పడుతుంది.

* * *

### ిరుతిండికి కారెట్లు

ఏదైనా తినాలనిపిస్తుందా? వేరుశనగలు ాక్లేటులు, పొటేటో చిప్స్ తినవద్దు. తినా ని అనిపించినప్పుడల్లా ఒక చిన్న కారెటు ుంప తింటూండండి.

* * *

### జుట్టు రాలిపోతూంటే?

తలమీద వెంట్రుకలు రాలిపోతూ తల పలచబడిపోతే మీకు ఆముదం ఎంతో మహోపకారం చేస్తుంది. పడుకునేటప్పుడు తల చర్మానికి బాగా తగిలేటట్టు ఆముదం రాసుకోండి. ప్రొద్దున్నే షాంపుతో స్నానం చేయండి. బాగా విటమిను 'B' వాడండి.

* * *

### కళ్ళక్రింద నల్లటి వలయాలు

కళ్ళ క్రింద నల్లగా వలయాలు ఏర్పడ్డాయా? మెత్తటి మస్లిన్ బట్టలో టీ సంచులు తయారుచేయండి. వీటిని ఉడుకు తూన్న నీటిలో కొన్ని సెకండ్లు ఉంచి తరువాత ఫ్రిజ్‌లో పెట్టండి, పడుకునే టప్పుడు కంటిమీద వీటిని వత్తుటుగా ఉపయో గించండి.

* * *

### మంచి ఆరోగ్యానికి నడక

అందం రెండు అక్షరాల మాట. దీనికి నడక ఎంతో ఉపకారం చేస్తుంది త్వర త్వరగా నడవాలి. షికారుగా మెల్లిగా నడ వడం కాదు.

## నాగరిక మానవుడు



అనేక సద్గుణాలతోపాటు నాగరికుడైన మానవునికి ధర్మము, దయ, దానము అంటే ఆత్మ సంయమం, కనికరం, దాతృత్వం అనే మూడు గుణాలు ముఖ్యంగా ఉండాలి. సమాజ శ్రేయస్సుకోసం సంయమంవల్ల ఆత్మ సంతృప్తి కలుగుతుంది. కనికరంవల్ల మానసిక భావాలు మృదువుగా ఉంటాయి. ఊరికే డబ్బు చేతిలో పెట్టడం కాదు దాతృత్వం దాతృత్వ భావం మనసులో వృద్ధి పొందాలి. ఇతరుల బాధలు తెలుసుకో డానికి మానవ నాగరికతకు ఈ మూడు లక్ష ణాలు ముఖ్యం.

—డాక్టర్ ఎస్. రాధాకృష్ణ

"ఇంద్రియ సుఖాలకోసం ఆరాటపడే శరీరం ఆత్మకు స్మశానం వంటిది."

# శ్రీకాళహస్తి

ఎన్. రామకృష్ణ

ఆంధ్రప్రదేశ్ చిత్తూరు జిల్లాలో కలియుగ వైకుంఠమనే తిరుపతి క్షేత్రానికి దగ్గరగా దక్షిణ కైలాసం శ్రీకాళహస్తి సుప్రసిద్ధ శైవక్షేత్రము. శివరాత్రినాడు కోటానుకోట్ల భక్తులు ఈ క్షేత్రాన్ని సందర్శిస్తారు.



పృధ్వి, అపః, తేజస్, వాయువు, ఆకాశం అనే పంచ మహాభూతాలను దేవతలుగా భావించి ఇంద్ర, వరుణ, అగ్ని, వాయువులను ఆరాధించడం అనాది నుంచీ వస్తూన్న మన సాంప్రదాయం. శైవ సిద్ధాంతులు, పంచ భూతాత్మకమైన పంచ లింగాలను ఏర్పరుచుకున్నారు. పృధ్వీలింగము (భూలింగం) కంచీపురంలో ఉంది. అప్ (నీటి) లింగము జంబుకేశ్వరమని చెప్పబడే తిరుచినాపల్లిలో ఉంది. ఈ లింగం ఎప్పుడూ నీళ్ళలో మునిగి ఉంటుంది. ఎంత ప్రయత్నం చేసి నీటిని తోడినా తిరిగి క్షణంలో నీరు చేరుతుంది. తిరువణ్ణామలై క్షేత్రంలో గల తేజోలింగం (జ్యోతిర్లింగం) జ్యోతిలా మండుతూంటుంది. శ్రీకాళహస్తీశ్వరంలో గల కాళహస్తీశ్వరుడు వాయులింగము. వెలుతురు ఎంత మాత్రం ప్రవేశించడానికి వీలులేని ఈ గర్భగుడిలో దీపం గాలికి రెపరెప లాడుతూంటుంది. ఇదే వాయులింగం అనడానికి నిదర్శనం. ఆకాశలింగం చిదంబరం క్షేత్రంలో ఉంది. వాస్తవానికి ఇక్కడ లింగం ఉండదు. ఒక తెర వేసి ఉంచబడుతుంది. భక్తులు కోరినప్పుడు ఆ తెరను ఎత్తుతారు. ఒక గోడ మాత్రం కనిపిస్తుంది. ఇదే ఇక్కడి రహస్యం.

కాళహస్తీశ్వరంలో అమ్మవారి పేరు జ్ఞానప్రసూనాంబిక. సంవత్సరం పొడవునా వివిధ ప్రదేశాల నుంచి యాత్రికులు సందర్శిస్తూనే ఉంటారు. ఆదిశంకరాచార్యుల వారు ప్రతిష్టాపించిన శ్రీచక్రం ఇక్కడ ఉంది.

ఈ దేవాలయం మిక్కిలి ప్రాచీనమైనది. గుడి ఆవరణ అత్యంత విశాలమైనది. దేవాలయంలో మంటపం స్తంభాలతో ఎంతో రమణీయంగా ఉంటుంది. జ్ఞాన ప్రసూనాంబిక విగ్రహం చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంటుంది. ఈ దివ్యక్షేత్రానికి

''జీవ బ్రహ్మంయొక్క ఐక్యాన్ని తెలిపేది మహావాక్యము.

శ్రీకాళహస్తి అని పేరు రావడానికి ఒక విచిత్రమైన కథ ఉంది. శ్రీ అంటే సాలె పురుగు, కాళము అంటే నాగేంద్రుడు, హస్తి అంటే ఏనుగు. ఈ మూడు స్వామిని సేవించి ఇక్కడ మోక్షం పొందడంచేత



PANCHAMUKHALINGA

దీనిని 'శ్రీకాళహస్తి' అన్నారు. దేవాలయంలో వీటికి కూడా కంచు విగ్రహాలు ఉన్నాయి. నేటి నేత్రదానం పురాణంలో ఏనాడో మనకు ఇక్కడ గోచరిస్తుంది. వేటగాడైన కన్నప్ప (కన్నప్ప నాయనారు) గొప్ప శివభక్తుడు. ఒకరోజున విగ్రహం ఒక కంటి నుంచి రక్తం ప్రవహిస్తుంది. అది చూసి ముగ్ధ భక్తుడైన కన్నప్ప బాణంతో తన కన్నును తీసి శివుని కంటికి అమర్చాడు. వెంటనే శివుడు ప్రత్యక్షమై నేత్రదానం చేసిన కన్నప్ప భక్తికి మెచ్చుకుని దృష్టిని కలిగిస్తాడు. దేవాలయ గర్భగృహంలో శివలింగానికి ఎదురుగా కన్నప్ప విగ్రహం ఒకటి ఉంటుంది. దేవలయానికి చేరువగా కైలాసగిరిపైన కన్నప్ప దేవాలయం ప్రత్యేకంగా ఉంది. ఈ కొండపై నుంచి శ్రీకాళహస్తి దృశ్యం మిక్కిలి రమణీయంగా ఉంటుంది. దగ్గరలో స్వర్ణముఖి నది పారుతూంటుంది దేవాలయం ఆవరణలో పవిత్రమైన మర్రిచెట్టు ఉంది. దీనికి ఊడలు ఉండవు.

దేవాలయంలో తెలుగు, తమిళభాషలలో, శాసనాలు అనేకం ఉన్నాయి. 100 స్తంభాల మంటపం, పెద్దగోపురం, 1438 లో విజయనగరరాజైన వీరప్రతాప కృష్ణదేవరాయలు నిర్మించాడు. చోళ, విజయనగర రాజులు దేవాలయంలో నిత్యపూజలకు, నిత్యదీపారాధనకు, నిత్య అన్నదానానికి అనేక విధులు ఏర్పాటు చేశారు. ఇటీవల తిరుపానాండల్‌లో కాశీమఠానికి చెందిన శ్రీలశ్రీ కాశీ అరుళానంది తంబిరాన్, కన్నప్పనాయనారు మరియు కుమార గురుపర స్వామిగళ్ జ్ఞాపకార్థం నిత్యాన్నదానం జరగాలని, తమిళనాడులో తేవారం పాటల ప్రచారం చేయాలని అనేక భూదానాలు చేశారు.

శ్రీకాళహస్తి వాసియైన ధూర్జటి, శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవులలో ఖ్యాతి పొందిన కవి. కాళహస్తి మహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకం అనే గ్రంథాలను రచించాడు. 'స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో యతులిత మాధురీ మహిమ' అని శ్రీకృష్ణదేవరాయల పొగడ్త లందిన కవీంద్రుడు ధూర్జటి.

కాళహస్తి గొప్ప నగరంగా రూపొందుతూంది. ఇత్తిడి కంచు లోహపు సామానులకు, గాజులకు కాళహస్తి చాలా ప్రసిద్ధి పొందింది.

"హృదయంలో సత్యం, శౌచం, ప్రేమ ఉంటే, నీవు చేసే ప్రతీ పనిలోను అవి ప్రతిబింబిస్తాయి."

# అదృష్టదేవత

పూర్వం ఒక రాజుకు 'అదృష్టదేవత' అనే కుమార్తె ఉండేది. ఒకరోజు రాజు 'అదృష్టదేవత' భవిష్యత్తు ఎలా ఉంటుందో



తెలుసుకోవాలని కుతూహలపడ్డాడు. గ్రహాలను లెక్కకట్టి భవిష్యత్తును చెప్పే జ్యోతిష్కుని రప్పించాడు. రాజకుమార్తె జీవితం ఎలా ఉంటుందో చూచి చెప్పమన్నాడు.

జ్యోతిష్కుడు పంచాంగాలు తిరగేసి, గ్రహాలు లెక్కకట్టి ఆలోచించి మెల్లిగా 'ఈ రాజకుమార్తె ఒక గొల్ల పిల్లవాడిని వివాహం చేసుకుంటుంది. ముగ్గురు పిల్లల సంతానంతో మీ దగ్గరే ఉంటుంది' అన్నాడు.

"నువ్వు చెప్పేది అబద్ధం. ఎంతోమంది యువరాజులు పెళ్ళి చేసుకుంటామని వస్తున్నారు" అన్నాడు రాజు. దానికి జ్యోతిష్కుడు వినయంతో "మహారాజా కానున్నది కాక మానదు" అన్నాడు.

ఇంతలో కొన్నాళ్ళకి ఇష్టం లేకపోయినా ఆమెను ఒక రాజకుమారునికి ఇచ్చి పెళ్ళి చేశారు. వివాహం జరిగిన తరువాత ఇద్దరు కలిసి రాజకుమారుని ఊరికి వెళ్ళారు. ఆ ఊరు ఎక్కడో కొండలు దాటి ఉంది. ఊరికి బయలుదేరి వెడుతూండగా మార్గంలో పెద్ద గాలివాన వచ్చింది. పిడుగు పడి రాజకుమారుడు మరణించాడు. రాజకుమార్తె ప్రయాణం ముందుకు సాగిస్తూ ఒక పెద్ద కొండ గుహదగ్గరికి వచ్చింది. మెల్లిగా గుర్రం దిగి గుహలోకి ప్రవేశించింది. అక్కడ ఒక గొల్లవాడు గాలివానకు భయపడి గొర్రెలను తోలుకుని గుహలోకి ముందుగానే ప్రవేశించాడు. ఇంతలో గాలివాన తెరిపిచ్చింది. గొల్లవాడు రాజకుమార్తెను పలకరించి తన ఊరికి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఆమెను పెళ్ళి చేసుకున్నాడు.

పన్నెండు ఏళ్ళు గడిచాయి. వీరికి ముగ్గురు కుమారులు పుటారు. ఆ ముగ్గురు గతం, వర్తమానం, భవిష్యత్తు. ఇలా ఉంటూండగా రాజుగారు అనుచరులను, సేవకులను పంపి కూతురు కోసం వెతికిస్తున్నాడు. ఏం లాభం లేకపోయింది. చివరికి తానే బయలుదేరి వెళ్ళాలని అనుకున్నాడు. ఒక మతగురువు వేషం వేసుకుని ప్రతీ ఊరు, గ్రామం వెతికాడు.

ఒకరోజు సాయంకాలం ఒక గ్రామంలోకి వచ్చాడు. చీకటి పడింది. ఒక ఇంటి తలుపు కొట్టాడు. తలుపు తెరిచారు. 'ఈ రాత్రికి ఇక్కడ పడుకోనిస్తారా' అని అడిగాడు. దానికి ఇంటి యజమాని అత్యంత

(మిగతా 55 వ పేజీలో)

'భిన్న భిన్నములైన కర్మలు భిన్న భిన్నములై

ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ ప్రసిద్ధి పొందిన కొబ్బరిచెట్టు యొక్క ఉపయోగకరమైన భాగం కొబ్బరిచిప్ప. ముఖ్యంగా ఫిలిప్పైన్స్, ఇండియా, శ్రీలంకా, మలేసియా, న్యూగినియా. మొదలైన దేశాలలో ఇది ఎక్కువగా లభ్యమవు



తుంది. మన దేశంలో కేరళ కర్ణాటకా, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు మొదలైన రాష్ట్రాలు కొబ్బరిచిప్పలను అధికంగా సరఫరా చేస్తున్నాయి. మొత్తం ప్రపంచంలో 3 మిలియను టన్నుల కొబ్బరిచిప్పలు సేకరింపబడుతున్నాయి. కొబ్బరిచిప్పలు సాధారణంగా కప్పులు, స్మోకింగ్ పైపులు, లాంపులు గరిటలు, పంచదార మరియు టీ పాట్లు, ఫ్లవర్‌వాసులు, పేపర్‌వైట్‌లు, గాజులు, బొత్తాములు, దువ్వెనలు, సంగీత వాద్యాలు మొదలైన వివిధ పరికరాలు తయారుచేసుకోడానికి వినియోగపడుతున్నాయి.

శ్రీలంక మరియు దక్షిణ ఇండియాలో కొబ్బరిచిప్పలు వంటకు ఇంధనంగా ఉపయోగిస్తారు. లాండ్రీలకు, కొలిమిలకు, బేకరీలకు, సున్నపుబట్టీలకు కూడా ఇంధనంగా ఉపయోగిస్తారు.

కొబ్బరిచిప్ప బొగ్గును మెత్తగా పొడిగా నూరి. ఉప్పు, మెంథాల్ చేర్చి పళ్ళు తోముకోడానికి ఉపయోగిస్తారు. త్రాగే మంచి నీటిలో ఫ్లోరైడును పోగొట్టి శుభ్రం చేయడానికి కొబ్బరిచిప్పల బొగ్గు బాగా ఉపయోగపడుతూందని ఇప్పుడు తెలుస్తూంది.

కొబ్బరిచిప్ప బొగ్గును ఆవిరితోను, ఆసిడ్‌తోను శుద్ధిచేస్తే ఆక్టివ్ కార్బన్ తయారవుతుంది. దీనిని సాధారణంగా వెజిటబుల్ నూనె, చక్కెర, పండ్లరసాలు, గ్లిసరిన్ మొదలైనవాటి శుద్ధీకరణకు ఉపయోగిస్తారు. ముఖ్యంగా వివిధ పానీయాలను తయారుచేసేవారు నీటిలో రంగును రుచిని నియంత్రించడానికి దీనిని ఉపయోగిస్తారు. కొబ్బరిచిప్పల నుండి తయారైన ఆక్టివ్ కార్బన్ ఔషధాల తయారీలో ఆల్కలాయిడ్‌ల, ఎంజైముల మరియు రకరకాల విషాల నిర్మూలనకు ఉపయోగపడుతుంది. వాతావరణంలో గాలి నుండి గాసొలైన్, పెట్రోలియం ఈథర్, సల్ఫ్యూరిక్ ఈథర్, బెంజీన్, ఆల్కహాల్, ఇథైల్ ఆసిటేట్ మొదలైన పదార్థాలను పొందడానికి ఉపయోగిస్తారు.

కొబ్బరిచిప్పల నుంచి లభించే పెంటోసాన్స్ నుంచి పెట్రోలియం, నైలాన్, విజిటబుల్ నూనె, ప్లాస్టిక్‌లు సింథటిక్

(మిగతా 59 వ పేజీలో)

దేహాభిమానం గలవారికి ఆత్మజ్ఞానం పొసగదు.

# సంతోషానికి సూత్రాలు

* ప్రతిరోజూ నీవు వేసుకునే పథకాలు, ప్రణాళికలు అతి సామాన్యంగా ఉండాలి సాధారణమైన పథకాలు, ప్రణాళికలు ఉత్తమోత్తమమైనవి.

* సంపాదించే దానికంటే తక్కువగా ఖర్చు చేస్తూండు. ఇది కష్టం అనిపించవచ్చు కాని మంచి లాభాలు కనిపిస్తాయి.



* స్పష్టంగా, నిర్దిష్టంగా, ఖచ్చితంగా ఆలోచించడానికి అభ్యాసం చేసుకో. మనసులో భావాలు వినియోగకరంగా ఆచరించగలిగినవిగా ఉండాలి.

* నీ మనసుకు తగినట్టుగా జరగాలను కోడం మాను. ఇతరుల అభిప్రాయాలను కూడా వివేకంతో అంగీకరించు.

* నీ ధర్మాన్ని నీవు ఆచరించేటందుకు సంతోషపడు. మానసిక భావాలను చెలరేగనీయకు. వాటిమీద పెత్తనం వహించు. మంచి స్వభావాన్ని పెంచుకుని మానసిక శాంతిని పొందు.

* తెలివిగా సూక్ష్మబుద్ధితో ఇతరులకు సంతోషం కలిగించడం కంటే ఆనందం మరొకటి లేదు.

* పారమార్థికంగా ప్రవృద్ధి కలిగించుకుంటూ ఆధ్యాత్మికోన్నతిని పొందడం కంటే ముఖ్యమైన జీవితలక్ష్యం లేదు.

* స్వార్థపరత్వాన్ని మానుకో. చేతనైన సహాయం, సేవ చేస్తూంటే తత్ఫలితంగా ఆనందాన్ని అనుభవిస్తావు.

* వెంటనే చేపట్టవలసిన సమస్యలను గురించి ఆలోచించు. నేటిని సద్వినియోగం చేసుకో.

* మంచి హాబీని అభ్యాసం చేసుకో. ప్రకృతి పరిశీలన, నడక, తోటపని, సంగీతం, ఇతర చేతిపనులు, స్టాంపుల సేకరణ, ఫొటోగ్రఫీ, సాంఘికసేవ మొదలైన హాబీలను అలవాటు చేసుకో. వినోదం కోసం, విశ్రాంతి కోసం వృత్తిని వృద్ధి చేసుకో.

* పరమాత్ముని సన్నిధానంలో నిజమైన ఆనందాన్ని అనుభవించగలవు. ఆధ్యాత్మిక ప్రగతి మార్గంలో అమితంగా నీకు దివ్యోపదేశం, దివ్యరక్షణ ఉండక మానదు.

"వ్యాధి కుదిరితే వైద్యప్రభావం, కుదరకపోతే రోగి ప్రారబ్ధం."

# రక్తానికి ప్రత్యామ్నాయం

యుఎస్ఎ చికాగో నార్త్ ఫీల్డ్ లాబొరేటరీలో రక్తానికి బదులుగా సరిక్రొత్త ప్రత్యామ్నాయం కనుగొనబడింది. వివిధ బ్లడ్ గ్రూపులతో, రకాలతోను నిమిత్తం లేకుండా



ఏ రోగికైనా దీనిని ఎక్కించవచ్చు. ఇది రక్తదానం చేసినవారి ఎర్రరక్తకణాలనుండి గ్రహించబడిన పాలిమరైజ్డ్ హ్యూమన్ హిమోగ్లోబిన్‌పై ఆధారపడి ఉంటుంది.

* * *

# నీరసించిన గుండెలను బలపర్చడానికి ఆరోగ్యవంతమైన హృదయాల ఉపయోగం

మాస్కో రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ అఫ్ సర్జికల్ అపరేటస్‌లో బయోస్టిములేటర్ (Bio-stimulator) అనే అపూర్వ సాధనం క్రొత్తగా అభివృద్ధి చేయబడింది. ఈ సాధనంద్వారా ఆరోగ్యవంతమైన హృదయాలను ఉపయోగిస్తూ నీరసించిపోయిన గుండెలను బలపరుస్తున్నారు. హృదయం పని చేసేటప్పుడు అతి సున్నితమైన బయోకరంట్ విద్యుత్ప్రవాహాలు జనిస్తాయని పూర్వం తెలుసుకున్నారు. బయోకరెంట్లను రికార్డుచేసి ప్రసారం చేయవచ్చు. ఆరోగ్యవంతమైన హృదయంనుంచి బయోస్టిములేటర్ బయోకరెంట్లను సంగ్రహించి నీరసించిపోయిన హృదయాలకు పంపుతుంది. దీని ప్రభావంతో హృదయం మరింత లయబద్ధంగా ఎక్కువ శక్తితో పనిచేస్తుంది.

# ఇన్సులిన్ పొడి

డయాబెటిక్ రోగులు చాలామందికి క్రమవిధానంలో ఇన్సులిన్ ఇంజక్షనులు చాలా ముఖ్యం. కానీ ఈ ఇంజక్షనులు ఎక్కువ ఇబ్బందిగా ఉంటాయి. అనుకూలంగా ఉండవు. సోవియెట్ జైవిక రసాయన శాస్త్రజ్ఞులు తేమలేని ఇన్సులిన్ పొడిని అభివృద్ధిచేసారు. ఈ పొడి జఠర రసాలవల్ల చెడిపోకుండా ఉంటుంది. మామూలు రిఫ్రిజరేటరులో $+4^{\circ}$ సెల్షియస్ దగ్గర నాలుగు ఏళ్ళదాకా ఇది చెడిపోకుండా అమోఘంగా పనిచేస్తుంది.

"ఆభరణాలు వేరైనా అందులో బంగారం ఒక్కటే -
అట్లే దేహాలు భిన్నమైనా ప్రాణ మొక్కటే."

## విటమిను సి కంటిపొరలను నివారిస్తుంది

విటమిను C (కాటారాక్టు) కంటి పొరలను నివారిస్తుంది. అతినీలలోహిత కిరణాలను ప్రసరింప జేసినప్పుడు కూడా విటమిను C అంటీఆక్సిడెంట్ లెన్స్ ప్రోటీనులు మబ్బు తెరగా ఏర్పడకుండా చేస్తుందని శుద్ధట్యూబు పరీక్షలవల్ల తేలింది రోజుకి (1 000మి.గ్రా) ఒక గ్రాము విటమిను C నిరపాయకరంగా కంటిపొర పెరగకుండా చేస్తుంది అని డాక్టర్లు అభిప్రాయపడుతున్నారు. అధికంగా నిమ్మజాతి పళ్ళు, బంగాళాదుంపలు. టొమాటోలు, స్ట్రాబెర్రీలు, మెలన్ చాలా ఉపయోగ పడతాయి. —హెల్త్ సౌజన్యంతో

* * *

## మెదడువాపు జ్వరాలకు క్రొత్త టీకా మందు

సోవియెట్ వైద్య పరిశోధకులు సాధారణంగా మెదడుకి వెన్నుపూసకు అపాయం కలిగించే సూక్ష్మజీవి సంబంధమైన వైరల్ ఎన్‌సెఫలైటిస్ నిరోధానికి అమోఘమైన టీకామందు అభివృద్ధి చేసారు. ఇదివరలో 7 ఇంజక్షన్‌లువలెగాక కొత్త విధానంలో రెండే ఇంజక్షనులు ఇస్తారు. ఈ ఇంజక్షన్లవల్ల 96 శాతం రోగ నిరోధకం ఉంటుందని అంటున్నారు.

—'హెల్త్ అండ్ మెడిసిన్' సౌజన్యంతో

(51వ పేజీ తరువాయి)

ప్రేమతో 'నిరభ్యంతరంగా నీవు ఈ రాత్రి ఇక్కడే ఉండి మాతో భోజనం చేయి' అని ఆప్యాయంగా చెప్పాడు.

రాత్రి భోజనం ఏర్పాటు చేస్తూండగా రాజకుమార్తె తన కొడుకులను ఒక్కొక్క



రిని పేరుతో పిలిచి భోజనానికి సిద్ధం చేయమని పురమాయించింది. రాజు గతం, వర్తమానం, భవిష్యత్తు పేర్లు విని ఆశ్చర్యంతో 'వాళ్ళకేం అలాంటి పేర్లు పెట్టావు?' అని అడిగాడు. దానికి రాజకుమార్తె 'నా జీవితం జ్ఞాపకార్థంగా ఈ పేర్లు పెట్టాను. నేను పూర్వం ఎవ్వరో, ఇప్పుడు ఎవ్వరో, ఇక మీద ఎవ్వరో వీరు సూచిస్తారు' అని చెప్పి తానొక రాజకుమార్తెనని, ఒక జ్యోతిష్కుడు భవిష్యత్తు చెప్పాడని వివరించింది.

రాజు ఆ మాటలు విని 'తల్లీ నేనే ఆ రాజును, నీ తండ్రిని. నేను నీ కోసం 12 సంవత్సరాలనుంచీ వెతుకుతున్నాను. చివరకు నిన్ను ఇక్కడ చూడగలిగాను' అని రాజకుమార్తెను, గొల్లవాడిని, వారి ముగ్గురు పిల్లలని ఇంటికి తీసుకువెళ్ళాడు. ఆనందంగా జీవితం గడిపారు.

'విశాల ఆకాశములోగానీ, అగాధ సముద్రములోగానీ, పర్వత గంభీర గుహాలలో గానీ దాగి తన దుష్కర్మల ఫలితమునుండి

## మల్హోత్రాకు యునెస్కో అంతర్జాతీయ బుక్ అవార్డు

భారతదేశంలో 30 సంవత్సరాల క్రితం గ్రంథ ప్రచురణా రంగంలో పేపర్ బాక్ (కాగితపు అట్ట) పుస్తకాల విప్లవ సృష్టికి డి. ఎన్. మల్హోత్రాకి 1988 వ సం. రం యునెస్కో ఇంటర్‌నేషనల్ బుక్ అవార్డు బహూకరింపబడింది.

* * *

## షిర్‌వాద్‌కర్‌కి జ్ఞానపీఠ్ అవార్డు

మరాఠీలో సుప్రసిద్ధ పండితుడు, నాటక కర్త, కవి అగు వి. వి. షిర్‌వాద్‌కర్ 'యయాతి అని దేవయాని' మరియు ఇతర రచనలకు 1987 వ సం.పురా. 1.50 లక్షల జ్ఞానపీఠ్ అవార్డు లభించింది.

* * *

## జె. సి. డానియల్‌కి పీటర్‌స్కాట్ మెరిట్ అవార్డు

బొంబాయి నేచురల్ హిస్టరీ సొసైటీ రక్షకుడు (క్యూరేటర్) జె. సి. డానియల్‌కి స్పీసీస్ సర్వైవల్ కమిషన్ ఆఫ్ ది ఇంటర్‌నేషనల్ యూనియన్ ఫర్ కన్సర్వేషన్ ఆఫ్ నేచర్ అండ్ నేచురల్ రిసోర్సెస్ వారి ఆకర్షణీయమైన పీటర్‌స్కాట్ మెరిట్ అవార్డు లభించింది. ఈ అవార్డును పొందడానికి ఇతడే మొదటి భారతీయుడు

## నగర ప్రదేశాలలో జనాభా సంవత్సరానికి 4 శాతం పెరిగిపోతూంది



యునైటెడ్ నేషన్స్ అంచనా ప్రకారం గత 30 సంవత్సరాల నుంచి నగర ప్రదేశాలలో జనాభా సంవత్సరానికి 4 శాతం చొప్పున పెరిగిపోతూంది. గత పది సంవత్సరాలలో ప్రపంచంలో నగర ప్రదేశాలలో జనాభా మరో 350 మిలియను పెరిగిపోయింది. వచ్చే 20 సంవత్సరాలలో నగర ప్రదేశాల జనాభా రెండింతలు కంటే అధికం అవుతుందని జనాభా లెక్కల శాస్త్రవిజ్ఞులు ముందుగానే తెలియజేస్తున్నారు. 2000 సం.రం నాటికి అభివృద్ధి పొందుతున్న దేశాలలో మాత్రమే జనాభా 1.6 బిలియను (1,600 మిలియను) అవుతుందని అంటున్నారు.

'తాను ప్రేమించిన వారితో కంటే, తనను ప్రేమించు వారితో వివాహం ఎంతో ఉత్తమం.'

### డా. రామారావుకి బి. సి. రాయ్ అవార్డు

డా. ఉప్పలూరి గాంధీ రామారావు గౌరవ ప్రదమైన బి.సి. రాయ్ అవార్డును పొందారు. వీరికి ఒక సర్టిఫికేటు, రూ. 10 000 నగదు బహుమానం లభించింది వీరు వికలాంగులకు అనేక రకాల చికిత్సా విధానాలను రూపొందించారు.

* * *

### డా. నాగేశ్వరరావుకి రాజ్‌కపూర్ మెమోరియల్ అవార్డు

మొట్టమొదటి జయభేరి రాజకపూర్ మెమోరియల్ అవార్డు సుప్రసిద్ధ తెలుగు సినీమా నటుడు డా. అక్కినేని నాగేశ్వర రావుకి లభించింది.

* * *

### డా. కె ఎమ్. చెరియన్‌కి 1988 ఇండో ఆస్ట్రేలియన్ అవార్డు

మద్రాసు మెడికల్ మిషన్‌కు చెందిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కార్డియో - వాస్క్యులర్ డిసీజెస్ డైరక్టర్ డా. కె. ఎమ్. చెరియన్‌కు గుండె సంబంధమైన కార్డియోవాస్క్యులర్ శస్త్రచికిత్సా రంగంలో చేసిన అపూర్వ సేవకు 1988 ఇండో ఆస్ట్రేలియన్ అవార్డు లభించింది. 1971 లో మొట్టమొదట సిడ్నీలోని సెంట్ విన్సెంట్ హాస్పిటల్లో ఓపెన్ హార్ట్ సర్జరీ నిర్వహించిన డా. చెరియన్ మొత్తం 8,000 ఓపెన్ హార్ట్ ఆపరేషన్‌లను అమోఘంగా చేపట్టారు.

## దేముడు ఉన్నాడనడానికి నిదర్శనం ఏమిటి?



విశ్వాంతరాళం భౌతికతలంలో గణిత శాస్త్ర సంబంధమైన ఒక క్రమపద్ధతి ఉంది. మానసిక తలంలో మనోశాస్త్ర సంబంధమైన క్రమపద్ధతి ఉంది. 'వీటి వెనుక విజ్ఞానం అనేది ఉంది. కాబట్టి దేవుని అనంతమైన శక్తి విజ్ఞానప్రభావంతో ప్రపంచం పోషించ బడుతూంది. అంతే కాదు ఎందరెందరో ఋషులు, భక్తులు అస్తిత్వాన్ని ప్రకటించారు. మానవ హృదయాంతరాళంలో భగవంతుని దివ్య తేజస్సు ప్రకాశిస్తూంటుంది. దీనిని తెలుసుకోడానికి విశ్వాసం, నమ్మిక. ధర్మబద్ధమైన భక్తి, దివ్యసంకల్పం పై విశ్వాసం ప్రవృద్ధి పొందాలి. ఈ విధంగా మనస్సు నిష్కళంకం అయినప్పుడు కంటికి తెలిసీ తెలియనట్టుగా గోచరించే పరమాత్మ భావం దివ్యజ్యోతిలా ప్రకాశిస్తుంది.

— స్వామి చిన్మయానంద

**రెండవ హెన్రీ ఫోర్డు వస్తువులను 1.87 మిలియను డాలర్లకు అమ్మారు**

సుప్రసిద్ధ అమెరికన్ ఆటోమొబయిల్ తయారీదారుడు రెండవ హెన్రీ ఫోర్డు పాత సామానులు, బల్లలు, కుర్చీలు, వింతవస్తువులు అన్నీ ఇంగ్లండు, ఆక్స్‌ఫర్డ్ షైర్‌లో అతని గృహంలోని టుల్‌విల్లి గాన్‌గె మైదానంలో 1.87 మిలియను డాలర్లకు వేలం వేయబడ్డాయి.

**కార్బన్ ఫైబర్‌ను ఉత్పత్తి చేసే మొట్టమొదటి ఇండిజినస్ ఫాక్టరీ:**

కార్బన్ ఫైబర్‌ను ఉత్పత్తిచేసే మొట్ట మొదటి దేశీయ ఫ్యాక్టరీని న్యూఢిల్లీ నేషనల్ ఫిజికల్ లాబొరేటరీవారు ఏర్పాటు చేశారు. ఇది సాలీనా ముఖ్యంగా డిఫెన్స్ మరియు అంతరిక్ష నౌకలకు ఉపయోగపడే 400 కి. గ్రా ల కార్బన్ ఫైబర్‌ను ఉత్పాదించగలదని ఆశిస్తున్నారు.

* * *

**4 వ శతాబ్దపు ప్రాచీన పర్షియన్ నిఘంటువు:**

సోవియెట్ యూనియన్ తాష్కెంట్‌లో ఒక గ్రంథాలయంలో 4 వ శతాబ్దానికి చెందిన ఒక పర్షియన్ నిఘంటువు కనుగొనబడింది. 5000 మాటల ఈ పర్షియన్ నిఘంటువు భారతదేశంలో ప్రసిద్ధ పండితుడు బదురుద్దీన్ ఇబ్రహీమ్‌చే సంకలనం చేసి వ్రాయబడిన లిఖితప్రతి. ఇందులో వైద్యం, భూగోళం, వ్యవసాయం, వివిధ పుష్పములు, జంతువులు మొదలైన విషయాలకు సంబంధించిన అపురూపమైన పదాలు ఉన్నాయి.

* * *

**'సిన్‌సిన్నాటి'నే 'పోర్కొపొలిస్' అంటారు:**

1850 లో యు ఎస్ ఎ సిన్‌సిన్నాటి పాకింగ్ గృహాలకు పందులను విస్తారంగా పంపేవారు. అప్పటినుంచీ ఆ నగరం 'పోర్కొపోలిస్' అని పిలవబడుతూంది.

* * *

**రంపపు పొట్టు టైరులు:**

రంపపు పొట్టు కూరిన పాత టైరులు సులభంగా పంక్చర్ అయి చెడిపోవు గాలి నింపిన టైర్లలాగే నిరాటంకంగా పని చేస్తాయి. బల్లపరుపుగా ఉండే లోహపు అంచు మాత్రం కట్టవలసి ఉంటుంది. నూనెలో నానబెట్టిన కొయ్య బేరింగులు ఉపయోగపడతాయి. వీటిని అమర్చిన బళ్ళు 500 కి.గ్రా. ల భారంతో గంటకు 15 కి. మీ. ల వేగంతో పోగలవు.

* * *

**K-జీరో అరుదైన బ్లడ్‌గ్రూప్:**

ప్రపంచంలో మొత్తం 50 మందికంటే తక్కువగా ఉన్న K-జీరో బ్లడ్ గ్రూపుకు చెందినవారిలో చైనాలో ఒక కుటుంబంలో ఒక పల్లెపడుచు, ఆమె చెల్లెలు, అన్న కూడా ఉన్నారు.

### రాయల్ గ్రీన్‌విచ్ అబ్జర్వేటరీ 1675 లో స్థాపింపబడింది:

నక్షత్రాల సాపేక్షస్థితిని, గతిని తెలుసుకోడానికి భూమి మీద లాంగిట్యూడ్‌ను టైమును సరిగా తెలుసుకొని నావికులకు సహకరించడానికి 1675 లో రాయల్ గ్రీన్‌విచ్ అబ్జర్వేటరీ స్థాపించబడింది. వీటిని బట్టే గ్రీన్‌విచ్ మెరిడియన్, గ్రీన్‌విచ్ మీన్‌టైమ్ అంతర్జాతీయ పరిమాణాలుగా చిరకాలం నుంచీ అంగీకరింపబడుతున్నాయి.

### కుండలో పొయ్యిమీద వంట:

సాంప్రదాయకంగా పొయ్యిమీద కుండలో వంటచేసే ఆవిడ ప్రక్క ఇంట్లో గాస్ స్టౌ మీద అల్యూమినియం పాత్రలలో వంట చేసే ఆవిడకంటే 8 రెట్లు అధిక శక్తిని వినియోగిస్తుంది.

* * *

### తలసరి నోబెల్ బహుమానాలు హంగేరీలో మిక్కిలి ఎక్కువ

తూర్పు యూరప్ హంగేరీ జనాభా 10 మిలియను. తలసరి అధికంగా నోబెల్ బహుమానాలు ఇక్కడవారికే లభించాయి. హంగేరీ జన్మస్థలం గలవారు 8 నోబెల్ బహుమానాలను పొందారు. ప్రప్రథమ హంగేరియా నోబెల్ బహుమాన గ్రహీత హెవిసీగయోర్గి వాన్ హెవ్. ఇతడికి 1966 లో కెమిస్ట్రీకి నోబెల్ బహుమానం లభించింది.

## ఆరోగ్యవంతుడు ఎవరు?



శారీరకంగా, మానసికంగా సమతౌల్యత కలిగి సమాజ వాతావరణానికి అనుగుణ్యంగా సరిపుచ్చుకోగలవాడే ఆరోగ్యవంతుడు. పరిసరానుగుణ్యంగా సంభవించే మార్పులకు తగినట్టుగా తన శారీరక, మానసిక శక్తులను నియంత్రించుకుంటూ సమాజ శ్రేయస్సుకి సౌభాగ్యానికి సహకరించగలవాడే ఆరోగ్యవంతుడు. కాబట్టి రోగం లేకపోవడం మాత్రమే ఆరోగ్యం కాదు. ఉత్సాహంతో జీవితం గడుపుతూ బాధ్యతలను సంతోషంగా స్వీకరించగలవాడే ఆరోగ్యవంతుడు.

(52వ పేజీ తరువాయి)

రబ్బరు, రెసినుల తయారీకి అవసరమైన ఫర్‌ఫురాల్ (Furfural) అనే పదార్థం తయారుచేస్తున్నారు.

కొబ్బరిచిప్పల పొడి ప్లాస్టిక్ పరిశ్రమలకు ఉపయోగపడుతుంది. కొబ్బరిచిప్పలను చితకకొట్టి చిన్న చిన్న ముక్కలుగా చేసి తరువాత మెత్తని పొడిగా చేసారు.

# సంక్షిప్త తెలుగు సాహిత్యము-పంచకావ్య పరిచయము

సీతారవిచంద్రన్

తెలుగు సాహిత్య పరిణామక్రమం పరిశోధకులు పరి పరి విధాలుగా విభజన చేశారు. కవుల చరిత్రలో కందుకూరివారు ప్రాచీన కవులు (1100-1500), మధ్యయుగ కవులు (1500 - 1650), ఆధునిక కవులు (1650-1700) అని మూడు విధాలుగా విభజించారు. కొందరు చాళుక్యయుగం, రెడ్డి రాజుల యుగం, విజయనగర రాజుల యుగం, నాయకరాజుల యుగం, ఆంగ్లేయ పాలనాయుగం అని విభజన చేశారు. ఈ విధంగా ముఖ్యకవులమీద, కాలంమీద, కావ్య భేదములమీద దేశములమీద ' ఆధార పరచి వాఙ్మయ విభజన కావించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు ప్రాఙ్నన్నయ యుగము. నన్నయ యుగము (నన్నయ, నన్నెచోడుడు, సోమనాథుడు), తిక్కన యుగము (తిక్కన, కేతన, మారన), ఎర్రన యుగము, శ్రీనాథ యుగము, శ్రీకృష్ణరాయల యుగము, నాయకరాజుల యుగము, క్షీణయుగము, ఆధునిక యుగము అని విభజించారు.

ఈ తెలుగు సాహిత్య పరిణామ క్రమానికి యుగ విభజన ఎలా ఉన్నా మన దేశంలో తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, ఉర్దూ, మరాఠీ, గుజరాతీ, ఒరియా, బెంగాలి మున్నగు భాషలన్నిటిలో, మిక్కిలి సొంపైనది తెలుగుభాష. తెలుగు భాషను నేర్చిన పాశ్చాత్యులు ఈ భాషను 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని స్తుతించారు. తెలుగు గొప్పదనమే గొప్పదనం. దీని గొప్పదనం ఇంతని చెప్పలేం. ఏ భాషకు లేని గొప్పదనం మన తెలుగుది. తెలుగు తనకున్న సహజశక్తితో వృద్ధి పొందింది..

తెలుగుభాషకు ముగ్ధుడై కర్ణాటకుడైన శ్రీకృష్ణదేవరాయలువారు 'దేశభాషలందు తెలుగు లెస్స' అని తన రాజ్యాంగం అంతా తెలుగుమయం చేసి తెలుగు కవులను పోషించాడు. బహుభాషా పోషకుడగు శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు కంఠోక్తిగా చేసిన ప్రశంస మన తెలుగుభాష గొప్పదనం.

## గుడ్లగూబ కాకికంటే తెలివితక్కువది



గుడ్లగూబ కాకి కంటే, బాతుకంటే కూడా చాలా తెలివితక్కువది. దాని పరిమాణాన్నిబట్టి చూస్తే దాని మెదడు చాలా చిన్నది.

"జగత్కారణమైన బ్రహ్మముయొక్క వాస్తవ స్వరూపాన్ని చెప్పేది అవాంతర వాక్యం."

ఆదికవి అనుకునే నన్నయ్యకు పూర్వం సాహిత్యం రూపొందింది. వివిధ రకాల దేశీయ కవితలు వెలిశాయి. అవి కాల గర్భంలో విలీనమైపోయాయి. నన్నయకు పూర్వం 3 వ శతాబ్దం నుంచి ఆరవ శతాబ్దంవరకు ఆంధ్రరాజ్యాన్ని పాలించిన రాజులు వేయించిన శాసనాలలో అనేక తెలుగు పద్యాలు గుర్తింపబడ్డాయి. క్రీ.శ. 6 వ శతాబ్దం నుంచి లభించిన శాసనాలలో వచన రచనలు, తరువోజ, సీసము, గీతము, ఉత్పలమాల, రగడ మొదలైన వివిధ ఛందో రచనలు లభించాయి. 11 వ శతాబ్దం నాటికి తెలుగుభాష కావ్య నిర్మాణానికి అనువైన స్థితిని అందుకుంది. మనకు లభించిన మొదటి తెలుగుకావ్యం తెలుగు భారతము. చాళుక్య రాజుల ఆదరాభిమానాలతో తెలుగు సాహిత్యం పెంపొందింది. తెలుగుదేశాన్ని సుమారు 500 సంవత్సరాలు పాలించిన చాళుక్యరాజులు తెలుగు, సంస్కృత భాషలను పోషించి ఆంధ్రసాహిత్య సామ్రాజ్యాన్ని నెలకొల్పారు.

నన్నయభట్టు ఆదికవి. రాజమహేంద్రవరం రాజధానిగా వేంగిదేశమును పాలించిన చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహంతో వ్యాసులు రచించిన సంస్కృత భారతాన్ని తెలుగు చేయడానికి పూనుకున్నాడు నన్నయ, తిక్కన, ఎర్రాప్రెగ్గడ అను కవిత్రయంచే ఆంధ్రమహాభారతము సంపూర్ణ రూపం పొందింది.

తిక్కన కాలంలోను ఆ తరువాత కూడా కొన్ని సంస్కృత పురాణాలు అనువదింపబడ్డాయి. మారన రచించిన మార్కండేయ పురాణం మొట్టమొదటి ఆంధ్ర మహాపురాణం. నాచనసోముడు హరివంశమును ప్రబంధంగా రచించాడు. 13 వ శతాబ్దంలో రామాయణం తెలుగులోకి రావడం ప్రారంభించింది. భాస్కరుడు, భాస్కర రామాయణం పద్యగ్రంథంగా రచించాడు. రంగనాథుడు ద్విపదలో రామాయణం రచించాడు.

15 వ శతాబ్దంలో అనేక సంస్కృత కావ్యాలు, నాటకాలు తెలుగులోకి అనువదింపబడ్డాయి. ఈ కాలంలో కవులనిపించుకున్నవారిలో అగ్రగణ్యుడు, కవిసార్వభౌముడు శ్రీనాథుడు. పద గుంభనతో, మదికారపు సొంపుతో, భావ శిల్పముతో శ్రీనాథుడు అనన్య సాధారణ మార్గంలో కాశీఖండము, భీమఖండము, నైషధం, హరవిలాసం, పల్నాటి వీరచరిత్ర మొద

## రాకాసి "సూర్యకాంతి"



ఫ్రాంక్ కెల్లాండ్ అనే ఒక ఇంగ్లీషు రైతు పెంచిన మిక్కిలి పెద్ద సూర్యకాంతి పువ్వు పరిమాణము 7 మీటర్లు 18 సెం.మీ.లు.

లైన కావ్యాలు రచించాడు. బమ్మెర పోతరాజు వలన భక్తిమయమైన ఆంధ్రమహాభాగవతము అవతరించింది. జక్కన విక్రమార్కచరిత్ర, అనంతుని భోజరాజీయము, నారాయణకవి పంచతంత్రము మొదలైనకథా కావ్యాలు వచ్చాయి. శకుంతల నాటకం (కాళిదాసు) తెలుగులో రూపొందింది.

16వ శతాబ్దం ఆంధ్ర సాహిత్యానికి స్వర్ణయుగం. ఇదే ప్రబంధ యుగము. పురాణాలలో ఉండే చిన్న చిన్న కథలు ఇతివృత్తములుగా గ్రహింపబడి వివిధ వర్ణనలతో, నాయికా నాయకుల శృంగార చేష్టలతో, అలంకార శైలిలో, పాండిత్య ప్రౌఢిమతో శృంగారరస ప్రధానంగా తెలుగు సాహిత్య ప్రబంధాలు బయలుదేరాయి. విజయనగర పాలకుడైన శ్రీకృష్ణదేవ రాయలు తెలుగులో గొప్ప విద్వాంసుడు. మహాకవి. సంస్కృతం, కన్నడం, తమిళం, ఉర్దూ మొదలైన బహుభాషలు ఎరిగి ఆయా భాషల సాహిత్యాలలో పాండిత్యం, పరిచయం కలవాడు. బహుభాషా సాహిత్య పోషకుడు. అనేక తెలుగు కవులను పోషించాడు. తెలుగులో క్షేత్ర మహాత్మ్యాలు వ్రాయబడ్డాయి. రాయలవారు సాహితీ సమరాంగణ సార్వభౌముడు. ఇతడి ఆస్థానాన్ని ఎనిమిదిమంది కవులు అలంకరించారు. వారే అష్టదిగ్గజాలు. అల్లసాని పెద్దన మనుచరిత్ర, ముక్కు తిమ్మనార్యుని పారిజాతాపహరణము, ధూర్జటి కాళహస్తి మహాత్మ్యము, తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యం, రామరాజభూషణుని వసుచరిత్ర, పింగళిసూరన కళాపూర్ణోదయము మొదలైన అద్భుత కావ్యాలు ఉద్భవించాయి. మొట్టమొదటి తెలుగు కవయిత్రి మొల్ల అత్యంత రమణీయంగా రామాయణం రచించింది. కొన్ని అచ్చ తెలుగు కావ్యాలు ఉద్భవించాయి.

కృష్ణదేవరాయల ఏలుబడిలో ఉన్న దక్షిణ దేశ రాజ్యాలు తంజావూరులోను, మధురలోను విజయనగర రాజుల అనంతరం 17-18 శతాబ్దాల మధ్య తెలుగు సాహిత్యం ఎంతో వర్ధిల్లింది. తంజావూరును పాలించిన రఘునాథరాయలు గొప్ప కవి. అనేక కవులను పోషించాడు. ఆనాడు పుట్టినదే చేమకూర వేంకటకవి విజయవిలాసము. రఘునాథ రాయల కుమారుడు వీరరాఘవ నాయకుడు అనేక యక్షగానాలను రచించాడు. ఇతడిఆస్థానంలో రంగాజమ్మ అనే కవయిత్రి రాజాచే

## చెట్లలో ఫలదీకరణ తేనెటీగలవల్ల జరుగుతుంది



1,00,000 వివిధ రకాల మొక్కలలోను, చెట్లలోను ఫలదీకరణ తేనెటీగవల్లే సంభవిస్తుంది. తేనెటీగలే లేకపోతే మనకు ఆపిల్‌పళ్ళు, జామపళ్ళు, ప్లమ్స్, బెర్రీలు, ఆప్రికాట్లు వగైరా ఏమీ లభించి ఉండేవికా

''రెండు రెక్కలతో పక్షి ఆకాశంలో సాగుతున్నట్టు జ్ఞాన కర్మలచే పురుషుడు పరమగతిని పొందుతాడు.

కనకాభిషేక సత్కారాన్ని పొందింది. మన్నారుదాస విలాసము, ఉషాపరిణయం కావ్యాలు రచించింది. ముద్దుపళని రాధికా స్వాంతనము అను మధుర ప్రబంధమును రచించింది. సత్యభామా స్వాంతనము (కాశీ సూరకవి), అహల్యా సంక్రందనము (వెంకటకృష్ణప్ప నాయకుడు), శశాంక విజయము (శేషము వేంకటపతి) మొదలైన గ్రంథాలు వచ్చాయి. త్యాగరాజ కీర్తనలు (భక్తి), క్షేత్రయ్య పదాలు (శృంగారం) తెలుగు సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. మెరుట్టూరు శివనారాయణశా శ్రీకృష్ణలీలా తరంగిణి ఉద్భవించింది. తంజావూరు నాయక మహారాష్ట్రుల కాలంలో యక్షగాన వాఙ్మయం అభివృద్ధి పొందింది. ఆ తరువాత ప్రభుపోషణ అంతగా లేకపోయినా అచ్చ తెలుగు రామాయణం, రసిక జనమనోభిరామము, కూచిమంచి తిమ్మన చంద్రరేఖావిలాసం (జగ్గకవి) మొదలైన కావ్యాలు బయలుదేరాయి. తిట్టు కావ్యాలు, చారిత్రక కావ్యాలు వచ్చాయి. బహుళ ప్రచారంలో ఉన్న సుమతీ శతకం, వేమన శతకం వంటి శతక రచన ప్రారంభమైంది. దండకాలు వ్రాయడం మొదలు పెట్టారు. అనేకమంది చాటువులు రచించారు. అప్పకవీయం వంటి ఛందస్సు, లక్షణ గ్రంథాలు వ్యాకరణ గ్రంథాలు, అలంకార గ్రంథాలు వచ్చాయి.

ఆ తరువాత 19వ శతాబ్దంలో పాశ్చాత్యుల ప్రభావంతో సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలు ఏర్పడ్డాయి. భావ కవిత్వం, విప్లవ కవిత్వం, నగ్న కవిత్వం, యతిప్రాసలు లేని పద్యాలు, వచన పద్యాలు, నాటికలు, నవలలు, కథలు, కథానికలు, చిన్నకథలు, ప్రహసనాలు, చరిత్రలు, స్వీయ చరిత్రలు. వ్యాసాలు, విమర్శలు అనేక విధాలుగా సాహిత్యం సర్వతోముఖంగా ప్రవృద్ధి పొందింది.

వెయ్యేళ్ళ పంటని చెప్పుకోతగిన తెలుగు సాహిత్యంలో అనేక కావ్యాలు వివిధ రూపాలలో అవతరించాయి. ప్రాచీన కావ్యాలలో ఉత్తమశ్రేణికి చెందినవి ఐదు కావ్యాలు. ఇవే తెలుగు పంచకావ్యాలు. ఆంధ్రకవులను పోషించి అద్వితీయ ప్రతిభాశాలియై బహు గ్రంథకర్తయై ఉత్తమ ప్రబంధ నిర్మాణానికి సహకరించిన రసిక శేఖరుడు కవిరాజు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానం అలంకరించిన అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రము తెలుగు పంచకావ్యాలలో మొదటిది. ఆంధ్ర ప్రబంధ కావ్యాలలో ఆదర్శమైన మహా కావ్యం. ఆంధ్రకవిత్వంలో విశిష్ట ప్రక్రియయైన ప్రబంధమునకు రూపుదిద్ది దానిని ప్రచారమునకు తెచ్చిన పెద్దన ఆంధ్రకవితా పితామహుడు. ఇతడి అల్లిక జిగిబిగి. పెద్దన దీనిని రాయలవారికి అంకితమిచ్చారు. పెద్దన కవితా మాధుర్యానికి ముగ్ధులై రాయలవారు ఆంధ్రకవితా పితామహుడు అనే బిరుదు నిచ్చి పెద్దనను గౌరవించారు. రాయలవారు స్వయంగా గండపెండేరము పెద్దన కాలికి తొడిగారు. మనుచరిత్రను అందుకునేటప్పుడు పల్లకి తాను చేపట్టి ఎత్తాడు.

తెలుగు పంచకావ్యాలలో రెండవదిగా పరిగణించబడింది వసుచరిత్రము. దీని రచయిత రామరాజభూషణుడు. ఇతడు శత లేఖినీ పద్యసంధాన ధౌరేయుడు. ఘటికా శత గ్రంథకరణధుర్యుడు. ఇతడు రాయలవారి అల్లుడైన రామరాయల కొలువునకు అలం

కారభూషితుడై అనేక సత్కారము లందిన మహనీయుడు ప్రబంధాంకము (ఇంటిపేరు) రామరాజభూషణుడే భట్టుమూర్తి. తెలుగు ప్రబంధ సాహిత్యంలో వసుచరిత్రకు అఖండ ఖ్యాతి ఉంది. ఇది సంస్కృతంలోకి, తమిళ భాషలోకి అనువదింపబడింది. వసుచరిత్రలో ప్రబంధాను గుణ్యమైన 18 వర్ణనలు ఉంటాయి ఆంధ్రభారతికి అమూల్య రత్నాభరణము వసుచరిత్ర. మనుచరిత్ర విజయనగర సామ్రాజ్య ఉచ్ఛస్థితితో వెలసింది. వసుచరిత్ర విజయనగర సామ్రాజ్య పతన దశలో వెలసింది. పెద్దనశిష్యుడే భట్టుమూర్తి. గురువుకు దీటైన శిష్యుడు. ఇతడు సాహిత్య రస పోషకుడు.

తెలుగు పంచకావ్యాలలో మూడవదిగా ప్రసిద్ధిపొందింది 'ఆముక్తమాల్యద'. క్రీ.శ. 1509 మొదలు 1529 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని ఏలిన శ్రీకృష్ణదేవరాయలు రచించాడు. ఏడు ఆశ్వాసముల ప్రౌఢ ప్రబంధము 'ఆముక్తమాల్యద'. గోదాదేవి అనే శ్రీ వైష్ణవి జీవిత కథ. విష్ణుచిత్తుడు వటపత్రశాయిని ప్రతినిత్యం తులసి మాలలచే అలంకరించి పూజించేవాడు. ఆయన కుమార్తె గోదాదేవి తండ్రి కట్టిన మాలను తాను ముందు ధరించిన తరువాత స్వామికి అర్పించుచుండెను. అందుచేతనే దీనికి 'ఆముక్తమాల్యద', విష్ణుచిత్తుని కథ అగుటచే 'విష్ణుచిత్తీయము' అని పేర్లు పెట్టబడ్డాయి.

తెలుగు పంచకావ్యాలలో నాల్గవది పాండురంగ మహాత్మ్యము. రాయల అష్టదిగ్గజ కవులలో ఒకడుగా సుప్రసిద్ధి పొందిన తెనాలిరామకృష్ణ కవి రచించినది గ్రంథము. ఇది క్షేత్ర మహాత్మ్యము. రాయల చరమదశలో నూత్నయౌవనంలో భువన విజయ కవితాగోష్ఠిలో పాల్గొని వికటకవి అని పేరు పొందాడు.

పంచకావ్యాలలో చివరది శృంగార నైషధం. భారత మహాకవుల తరువాత ఆంధ్ర కవితా ప్రపంచంలో ప్రసిద్ధిపొందిన పాండిత్య ప్రతిభావంతుడు సకల విద్యాసనాథుడు, "బహుదేశములు తిరిగి బహుశాస్త్రముల నెరిగి రసవత్కవిత రచించి రాజాధిరాజుల పూజలుగొని విద్యద్గోష్ఠులం దారితేరి, విద్యా వివాదములందు విజయము లంది భువనభూత కీర్తియై పూర్ణపురుషాయత జీవియై వివిధ కవివరుల గుండియలు దిగ్గురనగ స్వర్లోక ప్రస్థానమును సలిపిన కవి సార్వభౌముడు" అగు శ్రీనాథ కవి రచించినది. 'పలుకునుడి కారమున నాంధ్రభాషయంద్రు' అని తన భాషను ప్రశంసించుకున్న సరస కవితా దురంధరుడు. ఇది సంస్కృతంలో హర్షుని కావ్యమునకు తెలుగు సేత.

## చంద్రుని బరువు




చంద్రుని భారం 81,000,000,000,000,000,000 టన్నులు (81 సెక్స్టిలియన్ టన్నులు).